# స నా త న సా ర థి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక అధ్యాత్మికాభివృద్ధి కర్పితము


సంపుటము 15 | ఆగష్టు-సెప్టంబర్ '72 | సంచిక 7-8


విషయానుక్రమణిక

— :చిత్రము: —

ఉన్నత పాఠశాలా ప్రారంభోత్సవము



: హెచ్చరిక :—

ప్రశాంతినిలయమున పాతషెడ్లు, ఇండ్లు తీసివేసి, క్రొత్త షెడ్లు, ఇండ్లు క్యాంట్లు మొదలైన కట్టడపు పనులు చురుకుగా సాగుచున్నవిగాన, దసరా పండుగవరకు ఇక్కడకు వచ్చు భక్తులు, దర్శనావకాశములు వసతులు మొదలగు సౌకర్యములు లేక, చాల యిబ్బందుల పాలగుదురని అందరికీ తెలుపడమైనది.

చందాదారులకు విజ్ఞప్తి

చందాదార్లు తమరసీదులను చూచి కట్టవలసిన క్రొత్త చందాలు (రూ-4) ఇదివరకు పంపనియెడల కార్యాలయమునకు అక్టోబరు 72-15 వ తేదీలోపల చేరునట్లు పంపవలయును.

# దసరా మహోత్సవము

పరీధావి సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి (8-10-72) మొదలు విజయదశమి (17-10-72) వరకు ప్రశాంతి నిలయమున. భగవాన్ శ్రీసత్యసాయి బాబావారి దివ్యసన్నిధిలో, మహాపవిత్రమయిన దసరా మహోత్సవము, వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞముతో, అఖిలభారత ప్రశాంతి విద్వన్ మహా సభలతో. మహా వైభవముగా జరుగును.

ఉదయాది స్వస్తి ప్రణవకీర్తనము మంత్రానుష్ఠానములు, హోమము, ఏకాదశ రుద్రాభిషేకము. వేదపారాయణము. శ్రీమద్రామాయణ శ్రీమద్భాగవత. శ్రీదేవీభాగవత పారాయణములు జరుగును.

నిత్యమూ సాయంత్రము, 4గం॥నుండి 7గం॥ వరకూ ఆధ్యాత్మిక ప్రసంగాలు రాత్రి 8గం॥నుండి హరికథ, పాటకచ్చేరి, నాటకములు, బుఱ్ఱకథ. ఇత్యాది కళాప్రదర్శనములు జరుగును.

కావున. ఆస్తికులూ, భక్తులూ, సహృదయులూ తప్పక విచ్చేసి ప్రశాంతి నిలయ దివ్య వాతావరణమున క్రమ

శిక్షణలను పాటించుకొని మహాసభలలో పాల్గొని శ్రీవారి దివ్య దర్శనానందము నందుకొని వారు అనుగ్రహించు సందేశముల యొక్క అమూల్య లాభమును సంగ్రహించుకొని త్రికరణ శుద్ధితో ఆచరణ కుశలురై ఇతోధిక అభ్యుదయ శ్రేయముల నందుదురుగాక.

(ఆయా రోజుల కార్యక్రమ వివరాలు ప్రశాంతి నిలయమందు ప్రచురింప బడును.)

---

## ముఖ్య గమనిక

శ్రీవారి దర్శన నిమిత్తమై దసరా మహోత్సవము. జన్మ దినోత్సవము. మహా శివరాత్రి మొదలగు పర్వ దినములలో వచ్చి పోవు భక్తులు వేలకు వేలుండుటచే సరైన సదుపాయములు వసతులు తగినంత ఉండవు కనుక రోగులను చిత్తభ్రమ కలవారినీ ఉత్సవ సందర్భములలో తీసుకొని రాకూడదని హెచ్చరించుచున్నాము. అట్లు వచ్చిన ఉన్నవారలకూ రోగులకూ ఇద్దరికీ శ్రమగా నుండును కనుక. వచ్చిన తక్షణమే. త్రిప్పి పంపవలసి వచ్చును.

---



# రామ కథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

## 31

### అంతఃపురప్రవేశము

దివ్య రథమునెక్కి రామమందిరమునుండీ రాముడు పురవీధులగుండా కైకేయీ మందిరమునకు వెళ్లుచున్నాడు. శూరులు సింహనాదము చేసిరి. వందిమాగధులు మంగళ గానము ఆరంభించిరి. వివిధవాద్యములు మిన్నుముట్టినవి. జనసమూహములనుంచీ జయజయధ్వనులు చెలరేగినవి. చక్కగా అలంకరించుకొన్న వుత్తమాంగనలు మేడల నుండీ కిటికీలనుంచీ మంగళ హారతులు యెత్తుతూ, పూలరేఖలను చల్లుచుండ, కనుచూపు మేర దాటిపోయిన

రధమును మనోనేత్రములతో రాముని విగ్రహమును హృదయాలలో చిత్రించికొని స్తంభించి నిలిచిన జనము విగ్రహములవలే కట్టుకదలక వుండిరి.

కైలాస పర్వత శిఖరములవలే నున్న వర్ధమానము అనే దశరధ మహారాజు దివ్య భవనములోనికి రధము ప్రవేశించింది; ధనుర్ధరులు కావలికాస్తున్న మూడుకక్ష్యల లో రధము దాటింది. అక్కడ రాముడు దిగినాడు. మరి రెండు కక్ష్యలు పాదచారుడు ఆయి పోతూ తన వెంట వచ్చుచున్న మిత్రులను, లక్ష్మణుని. అక్కడే ఆగిపొమ్మని తెలిపినాడు.

అక్కడ యేమిజరుగనున్నదో, రాములకు, పూర్వమే తెలుసును, తెలిసినప్పటికినీ తాను సామాన్య మానవుని వలె సహజ ధోరణిలో ప్రవర్తించు చుండెను. కడకు అంతఃపురమున ప్రవేశించెను. తండ్రియైన దశరధుడు పాన్పుపై పడియున్నాడు. తనజుట్టు చెదరి, ముందు దినము వేసిన వస్త్రములలోనే పిచ్చివానివలే సక్రమ మార్గమును వీడి పడియుండుట రాములు చూచి ఆశ్చర్య పడి దగ్గరకు వెళ్ళినాడు. కైకేయి, పడక ప్రక్కనే నిలు చొని వున్నది. దశరథుడు కళాహీనుడై విలపించుచున్నాడు. తలనెత్తి రాముని చూచినాడు. నోటిలో మాటలు రాలేక పోయినవి. కన్నులధారలు ఏకధారగా కారదొడగెను.

చూచుకోలదీ దుఃఖము

దశరథుడు యేదియో చెప్ప ప్రయత్నించుచుండి నప్పటికినీ, నోటిమాట రాలేదు. ఇట్టి భయావహరూపమును రామచంద్రుడు ఇంతకుపూర్వ మెప్పుడునూ చూచియెరు గడు. చాలా కంగారుగా తండ్రిదగ్గరకు వెళ్ళి తండ్రి పాద ములు పట్టి, తామింత విలపించుటకు కారణమేమియో తెలిపిన దానికి తగినరీతుల నేను తమకు సంతోషము నందించుటకు ప్రయత్నింతును. జీవితమునైననూ నేను అర్పించి తమకు ఆనందము చేకూర్తును కాన, విలపించక కారణము తెలుపమని ప్రార్థించెను. అంత దశరథుడు "రామా"అని వక్క మాటమాత్రము పలికి బోరున యేడ్వ సాగెను; మతితప్పెను.

రాముడు యెంత వోదార్చిననూ క్షణక్షణమునకూ విచారము అధికమగుచూవచ్చెనే కానీ శాంతి చేకూరలేదు, అంత రాముడు ధైర్యముతో "నాన్నా! యేమిటిది. మాబోటి చిన్నవారలకు తగినంత ధైర్యము చెప్పనట్టి మీరు ఈరీతిగా విలపించుట సరికాదు, ఈ సమయమున అభినందించ వలసిన మీరు, ఘోరముగా దుఃఖించుట పాడియా? దీనికి పూర్వము యెంతో కోపముతోనూ, విచారముతోనూ వుండి నపుడు నన్ను చూచిన తక్షణమునందే కోపమూ, విచార మూలేక ఆనందముగా శాంతముతో నన్ను దగ్గర చేర్చు చుంటిరికదా. ఈనాడు అట్టిదానికి విరుద్ధముగా నన్ను

చూచుకొలదీ దుఃఖము అధికమగుచున్నది. ఈ విచిత్ర మునకు కారణముతెలిపి నన్ను ఆనందపెట్టరా? మీ విచా రము నన్ను మరింత విచారముతో ముంచివేయుచున్నది.

నావలన యేమైనా తప్పుజరిగినదా ? లేక, నేనేమై ననూ చేయవలసినదివున్న, తప్పక నేను చేతును. నా తప్పును తెలిపిన సరిదీద్దుకొందును. విచారించక, సంశ యించక, అభిమానము పెట్టుకొనక తెలిపిన నేను శిరసా వహింతును. తండ్రీ! మీరిట్లు చింతించుట మీకునూ, నాకు నూ, రాజ్యమునకునూ మంచిదికాదు'' అని ప్రార్థించుచూ కైకేయివైపునకు తిరిగిరి.

నా బాధను తీర్చుము

చేతులు జోడించుకొని, ''అమ్మా! నేనేమైననూ అప రాధము చేసితినా? నాన్నగారికి ఇంత దుఃఖమును కలి గించిన పాపి, యెవ్వరు తెలుపుము. నన్నుచూచిన తక్షణ మే అక్కునచేర్చి ఆదరించు తండ్రి ఈనాడు నా మొఖమై ననూ చూడకుండుటలో యేమి కారణము? వకపలుకైనా పలుకరించక మొఖము త్రిప్పుకొనుచున్నాడు. బహుశా నా వలననే అపరాధము జరిగియుండిన నేను యెట్టి శిక్షనైన నూ అనుభవింతును. నాన్నగారు ఆనందముగా వుండిన, అంతేచాలును. అట్లుకాక వంటిలో యేమైననూ అస్వస్థత యేర్పడినదా? లేక భరతశత్రుఘ్నులైన తమ్ములు యేమై

నా కబురంపిరా ? వారందరూ క్షేమమేకదా ? అమ్మలైన కౌసల్యా సుమిత్రలు క్షేమమేకదా ?

నాన్నగారి దుఃఖమునకు కారణమేమో తెలుసుకో లేనిస్థితిలో నేను బాధపడుచున్నాను. వారిని సంతోషపెట్టుటకు నేనెట్టి కార్యమైననూ చేతును. నాన్నగారి ఆజ్ఞను యెట్టిదైననూ శిరసావహింతును. లోకమున యెవరిజన్మకైనా తండ్రి కారణము; అంతవలన యెవరికైననూ తండ్రియే ప్రత్యక్షదైవము. నాకు అతని ఆనందముకంటే వేరు లేదు, యేమి జరిగినదో దయయుంచి తెలుపుము.

అమ్మా ! స్వాభిమానమువలన వారిని నీవేమైనా పరుషముగా అంటిరా ? లేక, నా తల్లి యేమైనా తండ్రిగారి మనసుకు విరుద్ధముగా నడచి బాధపెట్టెనా ? కౌసల్య అట్లు యెనాడూ చేయదు సుమిత్ర అంతకంటే చేయదు. వకవేళ వారు చేసిననూ నాన్న యింత విలపించరు. ఇందుకేదియో ప్రధానకారణము లేకుండదు. దయచేసి, నాన్న చెప్పటకు కొంత వెనుకాడిన, తామైననూ తెలిపి నా బాధను తీర్చుము'', అని వినయముతో ప్రార్థించిన రాముని చూచి, కైక

దయాదాక్షిణ్యమునువీడి పతి మరింత బాధపడునేమోఅన్న విచారమునుకూడనూ చేయక, ముందువెనుక యోచించక, ప్రమాదమును గుర్తించకనే చెప్పతగినదా,

చెప్పతగనిదా అనే నిత్యానిత్య విచారణ సలుపక, ప్రేమ ను ప్రక్కకునెట్టి, అభిమానమును అవలబెట్టి,

"రామా! విను! పూర్వము దేవాసుర యుద్ధములో మీ తండ్రిగారు బాణోపహతుడయి బాధపడుచున్న సమ యమున నేను అతనిని రెండు పర్యాయములు రక్షించగలిగితిని. అప్పుడు నా త్యాగమునకు మెచ్చి మీ తండ్రిగారు రెండువరములు కొరుకొమ్ము; ఇచ్చెదను, అని తెలిపిరి. అనాడు వారు క్షేమముగా జీవించుటే నా ప్రధాన లక్ష్యముగా వుండుటచేత నేను ఇప్పుడెమీ నాకక్కరలేదు అవసరమొచ్చినపుడు కోరుకొందునని, తెలుపగా, అందులకు మీ తండ్రిగారు సరేనని, నీకిష్టమొచ్చినప్పుడు ఇష్టమొచ్చిన కోరిక కోరుకొనవచ్చును తప్పక తీర్తును; దీనికొక కాలనీమ ముకానీ, విషయసంబంధముకానీ వుండదు. యే కాలము లోనైనా యే విషయమునైనా, నా జీవితములో, అడిగినపుడు తీర్తునని మాటయిచ్చెను. ఈక్ష్వాకువంశమున ఆడినమాట తప్పరన్న విషయము నీకు తెలియును కేదా ?

ఇంత చిన్నవిషయము

అట్టి విశ్వాసముతో నేను, ఆ రెండు వరములనూ కోరుకొంటిని, వకటి: నా ప్రేమపుత్రుడైన భరతునకు పట్టము కట్టమనియూ, రెండవది: నిన్ను పదునాలుగు సంవత్సరము లు దండకారణ్యమునకు పంపమనియూ కోరితిని. ఇంత

మాత్రమునకే మీ తండ్రిగారు ఇంత ఆరాటము చేయు చున్నారు.

వేయేటికి ? ఈ నా సంకల్పము నేను మానుకోను. మీ తండ్రిగారు సత్యవ్రతుడు అనీ, నీవు సత్యవ్రతుడవు అనీ ఋజువుచేయ తలచుకొన్నట్లయితే, నీవిప్పుడే జటాజినాలు ధరించి దండకారణ్యము పోవలెను. అక్కడ పద్నాలుగు సంవత్సరములు నివసించవలెను. నీ తండ్రికి నీవన్న ప్రాణ మగుటచే, నిన్ను పంపుటకు యిష్టములేక, నీవేమనుకొందువో అని, నీకు చెప్పుటకు సిగ్గయి దుఃఖించుచున్నాడు. అంతేకానీ మరే ప్రళయమూ సంభవించలేదు.

ఇంత చిన్నవిషయమునకు కొండంత ప్రమాదము జరిగినటుల విలపించుటలో అర్థములేనిదిగా వున్నది. రామా! అంతేకాదు; తండ్రిచేసిన వాగ్దానమును అతను తీర్చ లేకపోయిననూ తండ్రి ప్రతిబింబముగా పుట్టిన కొమారుడు దానిని తిర్చుటకు పూనుకొనిననే తండ్రి తరించగలడుకానీ, తానూచేయక కొమారుడూ అట్టిదానిని గమనించకుండిన తండ్రి అధోగతిపాలు కావలసివచ్చును. తండ్రి ఋణము ను తీర్చుటే కొమారుని ప్రథమకర్తవ్యమన్నది నీకు తెలియ నిదికాదు'' అని ఆమె నిర్దాక్షిణ్యముగా తెలుపు మాటలకు రాముడు చలించక, చిరునవ్వుతో

''ఇంతమాత్రమునకే నాన్నగారు ఇంత విలపించుట నిజముగా న్యాయముకాదు'', అని ఆనందవచనముతో

అంగీకరించినటుల తలవూపినాడు. ఈ మాటలు వినుచుం డిన దశరథుని హృదయము కరకరా రంపముతో కోసిన టుల అయినది. తల్లడిల్లినాడు, రాముడు కైకేయి వైపునకు తిరిగి, "తల్లీ, నీవనుకొన్నటులనే జరుగును. మా నాన్నగారి శపథమును నేను శిరసావహించుచున్నాను.

అయితే, నాన్నగారు వక్కతూరి యెప్పటివలే దగ్గర చేర్చి ఆదరించి ఆశీర్వదించిన చాలును. అట్టిదానికికూడ నూ నేను నోచుకోలేదని తెలిపిన, అదియును నేను అనం దముతోనే అందుకొందును. నా తండ్రి యెప్పుడునూ నా మేలు కోరువారే. అతను మహానుభావుడు. వారు నాకు వక్క తండ్రియేకాదు, మంచిని బోధించుటలో అచార్యు లు! అట్టి జనకుడు అచార్యుడు అయిన వారిని సంతోష పెట్టుటకంటే నాకు వేరుకర్తవ్యమేమున్నది? అదే నా ముఖ్యధర్మము.

తల్లిచెప్పినా, తండ్రిచెప్పినా

భరతునకు రాజ్యాభిషేకము చేయుటలో నేనెంతనో ఆనందింతును. పదునాలుగేండ్లు వనవాసము చేయుటలో మహదానందపడుదును. పదునాలుగేండ్లేకాదు! తండ్రి ఇష్ట మయిన యావత్‌జీవితమునే అరణ్యములయందు గడుపు టకుకూడా సంసిద్ధుడను కానీ నాన్నగారు ఈ రెండు విష యములను, నాతో చెప్పుటకు యెందులకు వెనుకాడు చున్నారు? అదే నాకు బాధగావున్నది.

తానుచెప్పిన, చేయకుందునా ? తనమాట కాదందు నా ? ఈ రాముడు పితృవాక్య పరిపాలకుడుకానీ పితృ ద్రోహి కాడు తండ్రినుండి యేర్పడిన ఈ కాయమును తండ్రికి అర్పించుటకంటె వేరు కృతజ్ఞతకలదా ? హృద యపూర్వకమైన ఆనందముతో అర్పింతును; నేను వకరితో చెప్పించుకొనువాడను కాను. భరతునికి రాజ్యాభిషేకము చేయవలెనని నీవైననూ నాతో వకపరి తెలుపలేదెందులకు? నాకునూ నా తమ్మునికీ యెట్టిభేదమూలేదు. అట్టి భేదరహిత హృదయునిచెంత నీవెందుకు భేదమును పాటింతువు. ఇది మీ తండ్రి ఆజ్ఞఅని యెందులకందువు ? నీ ఆజ్ఞమాత్ర ము నే మీరుదునా ? మీరను.

నీవుచెప్పినా తండ్రిచెప్పినా నేను ఆనందముతో చేతును. నేడే అయోధ్యనువదలి అరణ్యమునకేగుదును. అమ్మా ! భరతుణ్ణి తాతగారి యింటినుండి రావించడానికి నేడే తగిన దూతలను పంపించుట, అందుకు తగినయేర్పా ట్లు చేయించుట మంచిది. ఆలస్యమెందులకు, నా అరణ్య వాసముతోపాటు భరతుని పట్టాభిషేకముకూడా జరిగిన తండ్రిగారికి కొంత శ్రమతప్పును. తమకూ సంతృప్తి కలు గును. ఆ తరువాత యెట్లుండునో యెవరు చెప్పగలరు" అని రాముడు చెప్పినందువలన

కైకేయికి వకవైపున ఆనందము వకవైపున కొంత సంశయముకలిగి, భరతుడు వచ్చిన యేమిమార్పు కలు

గునో, భరతుడు వచ్చునంతలోనే, అనగా, నేడే రాముని అరణ్యమునకు పంపుట మంచిదని తలంచి, "రామా, నీవు చెప్పినటుల భరతుని అయోధ్యకు తెచ్చు యేర్పాట్లు ఇప్పుడే గావించవచ్చును. అయితే, భరతుడు వచ్చునంత వరకూ నీవు అయోధ్యలో వుండనవసరములేదు.

## 32

### మాతృవాక్యము

నీవు యెట్లాగు వనవాసముచేయ నిశ్చయించుకొన్నావు కనుక కాలయాపన యెందుకు? వెళ్ళుటకెంత ఆలస్యముచేసిన తిరిగీ వచ్చుటకు అంత ఆలస్యము కాగలదు. ఇప్పుడే సిద్ధమగుట మంచిది.

ఇదంతా నీతో స్వయముగా చెప్పుటకు మీ నాన్నగారు కొంత వెనుకంజ వేయుచున్నారు. చెప్పవలేనన్న భావము హృదయములో వుండియూ, ప్రేమించిన కొమరునికి ఇట్టిఆజ్ఞ యెట్లుచేతునను సిగ్గు అతనిని కొంత హింసించుచున్నది. తన వాగ్దానము నీతో చెప్పుటకు మనస్కరించక, ఇంత దుఃఖించుచున్నారు తప్ప అంతకంటే అతనికి వేరు దుఃఖములేదు. నీవెంత త్వరగా అయోధ్యను వదలిన మీ నాన్నగారి దుఃఖము అంత త్వరితముగా తగ్గిపోవును.

నీవు అయోధ్య వదలువరకూ ఆహారస్నానాదులు సహిత ము చేయరు. కాన మీ నాన్నగారి దుఃఖము యెంత త్వరి తముగా చల్లారవలెనని తలంచిన అంతత్వరగా నీవు అయో ధ్యవీడుట మంచిది.''

అని నిర్దాక్షిణ్యముగా పలికిన కైకపలుకులు, విను చున్న దశరథుడు పట్టలేని దుఃఖముతో, మాటలురాని స్థితిలో ఛీ, ఛీ, దుర్మార్గురాలా. అంటూ, రామా! రామా! అని తిరిగీ మూర్ఛపోయినాడు. అంత వకవైపున దశరథుని తల తొడపైనుంచుకొని, తండ్రిని వోదార్చుచూ మరొక వైపున, కైకతో, అమ్మా! నేను అర్థపరుణ్ణికాను, లోకులను లోబరుచుకొని రాజ్యమునేలవలెనను కాంక్ష నాకు లేదు. ఋషివలె ఉండవలెననుకోరిక! కేవలము ధర్మమును నిల బెట్టవలెననుకాంక్ష! పూజ్యపాదులైన తండ్రిని సంతోషపెట్ట వలెననుదీక్ష! తప్ప అన్యములేదు. ఈ మూడింటికి యేపని యైనా చేస్తాను; ప్రాణమునైనా అర్పిస్తాను.

పుత్రుడయిన వానికి పితృసేవ పితృవాక్యము కన్నా, మహత్తరమైన ధర్మము మరియొకటిలేదు. అమ్మా నాన్నగారు నాతో వాచా చెప్పకపోయిననూ. వారు ఆజ్ఞాపిం చినటుల నీవు చెప్పుచున్నావుకదా? అంతేచాలు. ఇంతి యేకాక అతని సమక్షమున నీవు చెప్పుమాటలు, అతను వినుచున్నప్పటికినీ, అతను యేమియూ చెప్పలేకపోవుట లో, అతని మాటలుగనే అర్థమిచ్చుచున్నది.

శిరసావహించి

కాన, నేను శిరసావహించి వెళ్ళుచున్నాను. అమ్మా! ఈ నా చిన్నవాంఛను నెరవేర్తురని ఆశింతును. యేమన, భరతుడు రాజ్యపాలనముచేస్తూ; నాన్నగారి ఆజ్ఞను శిరసావహించి అతనిని ఆనందపెట్టునటుల చూచు బాధ్యత నీది; నేనుకానీ. భరతుడుకానీ, వేయేటికి, యెప్పుడైననూ తండ్రిని ఆనందపరచుటకంటే తండ్రిని సంతృప్తుని చేయుటకంటే వేరొండు వ్రతములేదు. పితృసేవ, పుత్రునకు సనాతనధర్మము'' అని నమస్కరించగా

వింటూవున్న దశరథుని గుండెలు బ్రద్దలయినట్లుగా రాముని ధర్మవచనములు, శాంతభావమును విని, అతనిపై నున్న ప్రేమ మరింత దుఃఖమునందించి, రాముడు ఇక అయోధ్యలో నిలువడను నిశ్చయము చేసుకొని, దశరథుడు మానాభిమానములు వీడి విచారించక, బావురుము అని అరచి నేలకూలినారు.

ఈ శబ్దము అంతఃపుర కాంతలందరూవిని, వారిలో వారు, ఆశ్చర్య దుఃఖములతో అందరూ యేడ్వసాగిరి. ఇక ఆలస్యముచేయుట మంచిదికాదని రాముడు గ్రహించి తండ్రిపాదములకు నమస్కరించి అంతఃపురమునుండి బయలు దేరెను.

ద్వారము దగ్గరనిలిచి, పైనజరుగు సంభాషణలు

వింటూవున్న లక్ష్మణుడు కంటిదారలు కారుస్తూ వకవైపున కైకపై ఉగ్రుడై తండ్రిపై క్రోధమును పూని యేమియూ చెప్పలేని స్థితిలో రాములు వెలుపల రాగానే అతనిని అనుసరించుచూ చేతులు కట్టుకొని కన్నెత్తిచూడక తలక్రిందికి వంచుకొని వెళ్లెను.

అయితే రాజ్యము పోయిననూ, అరణ్యవాసము ప్రాప్తించిననూ చిమ్మ చీకట్లు క్రమ్ముకొన్నా చంద్రుని కాంతిమాసిపోనటుల రాముని ముఖవికాసము ఏమాత్రమూ మాసిపోక మానావ మానములు లెక్క చేయక పరమయోగీంద్రునివలె చిత్త వికారము యేమీ లేకుండా, నడచి వచ్చుచున్న రాముని చూచిన, లోపల యేమీ అశాంతి జరుగలేదన్నట్లు తోచును.

సుమ తునిడఃహ

అయితే సుమంతుడు లోనయేదో విరుద్ధమయిన మార్పు జరిగినదని అనుమానించెను. అనుమానించుటేమి జరిగినదనే నిశ్చయము చేసుకొనెను. లక్ష్మణుని చూచిన సుమంతుని గుండెలు ఝల్లు మనెను. దానికి తగినట్లు రాములు వెలుపల వచ్చినతోడనే శ్వేతచ్ఛత్రము పట్టిన తోడనే అది తన కక్కరలేదనియు వింజామరలు వీచ కూడదనియూ వెండిరథము తనకింక అర్హతకాదనియూ చెప్పిన రామవాక్యములతో సుమంతుడు నీరయిపో

యెను. తన తలంపు పరమ సత్యమని నిర్ణయముచేసు
కొనెను.

అంతేకాక, స్వజనులతో కానీ పురజనులతో కానీ
మాటాడక, తనకు దుఃఖము లేకపోయిననూ, వార్త
వినిన ఇతరులు దుఃఖపడుదురన్న భావముతో తనమా
టలలో సత్యము తెలుపక తప్పదనియు తెలిపిన అంద
రినీ తనమాటలే బాధపెట్టినటుల కావచ్చుననియూ
తలంచి మాటలాడుటకే పూనుకొనక పోవటలోని అంత
రార్థమని, చెప్పకచెప్పుచుండెను.

నేరుగా, సీతాంతఃపురమునకు వెళ్ళక, కౌసల్యాం
తఃపురమునకు రాముడు కాలినడకసాగించెను. ఎంతో సంతో
షముతో మాటలాడుతూ వున్న కౌసల్యాదేవి మందిరము
నకు అన్నదమ్ములైన రామలక్ష్మణులు వచ్చుచున్నారన్న
వార్త కౌసల్యాంతఃపుర వనితలకు తెలిసి వారందరూ
మంగళ హారతులు సిద్ధము చేసుకొని దారులు కాచి
యుండిరి, అంతఃపుర ద్వారముదగ్గర పరమ పుణ్యులు
వృద్ధులు అయిన ద్వారపాలకులు రాముని రాకనుచూచి
దిగ్గునలేచి విజయీభవ విజయీభవ అంటూ తలలువంచి
నమస్కరించిరి. రాములు ఆమందిరములోని రెండవ
కక్ష్యవరకూ వెళ్ళగనె బ్రాహ్మణులు ఆశీర్వదించిరి.
మూడవ కక్ష్యలోనికి ప్రవేశించగనే, ద్వారపాలకులైన
యువతులు అన్నదమ్ములైన రామలక్ష్మణులను చూచి

పట్టలేని ఆనందముతో లోనికి పరుగెత్తుకొని పోయి కౌస ల్యాదేవికి రాముడు సోదరుడైన లక్ష్మణునితో వచ్చుచున్న ట్లు తెలిపిరి.

అక్కడనుండి కౌసల్యాదేవి పూజామందిరము వరకూ ఇరుప్రక్కలా జ్యోతులు పట్టుకొని హారతులు యేత్తుతూ సుమంగళులు అలంకారములు చేసుకొని అత్యంత రమణీయమైన రామరాకకు యేదురు చూచు చుండిరి. రాముని చూడగనే, మంగళహారతులు యెత్తిరి కౌసల్యాదేవి రాత్రి అంతయూ జాగరణచేత తెల్లవా రుఝామున పూజలూ వ్రతములు మొదలుపెట్టి వృద్ధ బ్రాహ్మణులతో హోమాదులు చేయించు చుండెను ఆతల్లి పరమానందముతో తన కుమారుని అభిషేకమ హెూత్సవమును కన్నులారా చూడగల్గు చున్నానను ఆనందముతో అనేక రకముల పూజలు, దానధర్మాలు గావించుచూ. ఆహారనిద్రలుమాని ఆనంద ఆహారమునే ఆరగించుచూ

పరువు లెత్తుకొని రాములకు యెదురుగా వచ్చి, రాముని శిరస్సుముద్దాడి చేయిపట్టుకొని పూజామందిర మునకు తీసుకొని పోయేను. జరిగిన విపరీతము ఆమె కేమాత్రము తెలియదు. అమాయకురాలు, నిరపరాధి అయిన కౌసల్యా నిర్మలప్రేమతో తెల్లని చీరెను కట్టుకొని వ్రతకంకణములు కరమునకు ధరించి అత్యంత ఉల్లా

నముగా తిరుగాడుచున్న కౌసల్యకు, రాముని మొఖము పరమ తేజముగా కనుపించెను. అంతటిలో కౌసల్య తన మనమున నున్న ఆనందమును దాచుకొనలేక

నాయనా. రామా! నీపూర్వీకులు అందరు రాజర్షులు, పరమధార్మికులు, మహాత్ములు, వారలందరివలే నీవు కూడనూ దీర్ఘాయుష్మంతుడవు కావలేను. వారివలేకీర్తి మంతుడవు కావలేను. నీకీకీర్తి దిగ్దిగంతాలలొనూ వ్యాపించవలెను.

తల్లిబోధ

నాయనా! నీవంశోచిత ధర్మాన్ని యెప్పుడు యేమరు పాటునైనను మరువక, తప్పక ఆచరించవలెను అని ఆశీర్వదించుచూ. అక్షితలు శిరస్సునచల్లి ప్రక్కనే బంగారు పీఠవేసి నాయనా, రాత్రి అంతయూ నీవు కూడనూ దీక్షను పూనియుండుటచేతను ఉపవాసవ్రతముచేయుటచేతను కొంత అలసివుందువు.

అందుపై కూర్చుని కొంత ఫలహారము చేయుట మంచిది అని కోరి తట్టలు సిద్ధముగా వుంచి పెట్టియుండిన బంగారు పళ్లెరమును అందుకొనెను. తల్లీపడుచున్న ఆనందమును,

ఆమె ప్రెమనూ వక వైపున గమనించి, ఈ సమయమున ఆమెకు జరిగిన వార్తయెటు తెలుప వలెనని

యోచించుచూ. సిగుపడి. తల్లిసంతృప్తికోసము ఆపీఠను తట్టను చేతితోతాకి, తల్లీ! ఇప్పటి నుండియూ నేను సువర్ణమును ముట్టరాదు. బంగారు పీఠపై కూర్చొన రాదు. తమరు ఆశీర్వదించిన నేనిక నమస్కరించి దండకారణ్యము పోవలెను. అనుజ్ఞకైవచ్చితినని, తెలుపగా

కౌసల్యకు అర్ధముకాక, నాయనా! కొన్నినిమిష ములలో పట్టాభిషేకము జరుగుచుండ, దండకారణ్యా మనుమాట చెప్పుటలో నాకేమీ అర్దమగుటలేదు, అని నవ్వులాటలాడుచున్నాడు నా కుమారుడు, అని, భావించి.

నాయనా! ఈ శుభసమయమున నవ్వులకైననూ ఇట్టి అశుభ పలుకులు ఆడరాదు. నా బంగారు తండ్రి అని క్షీరాన్నమును తనవ్రేళ్ళతోతీసి రాముని నోటిలో పెట్టెను.

ఆ ప్రేమను ఆమె ఆనందమునూ చూచుచూ లక్ష్మ ణుని కంటినుండి తనకు తెలియక కంటిధారలు కారదొడ గెను. వాటిని గమనించిన కౌసల్య ఆశ్చర్యముతో నాయనా! లక్ష్మణా! యెందులకంత విచారము అని దగ్గర చేర్చుకొనగ నే లక్ష్మణుడు పట్టలేక గొల్లున యేడ్చెను. కౌసల్యాదేవికి యేమియూ అర్థముకాలేదు. రామునిమాటలకూ, లక్ష్మ ణుని విచారమునకూ తాను అయోమయస్థితిలో మునిగెను.

ఇంతలో రాముడు తల్లిచేతులు గట్టిగా పట్టుకొని

అమా మీరు విచారించనని మాటయిచ్చిన నేనొక మాట చెప్పెదను. ఇది నాకునూ నీకునూ యావత్ వంశమునకే సత్కీర్తిని తెచ్చునట్టిది కాన నీవు యే యోచనకూ చోటివ్వక ప్రీతితో అంగీకరించవలసియుండును. నాన్నగారి ఆజ్ఞను నేను శిరసావహించుట నీకునూ పరమ సంతోషమే. కదా ? నాన్నగారు తమ్ముడైన భరతునికి పట్టాభిషేకము చేయ నిశ్చయించిరి. నన్ను పదునాలుగు సంవత్సరములు దండకారణ్యమునకు తాపసవేషమున వంపుటకు నిశ్చయించిరి. వారిఆజ్ఞ నేను అంగీకరించి తమ ఆజ్ఞకై వచ్చితిని, అని తెలుపగనే

కౌసల్యాదేవి శోకము

రామా ! అని కౌసల్య నేలకూలెను. యేమి ఈ విపరీతము, నా కోమలి పుత్రుని కారడవులకు పంపుటయా ? అట్టి అపచారము నా రాముడేమిచేసెను? ఇది నిజమా? లేక రాత్రిఅంతయూ మేలుకొని ఉపవాసమునలిపి యుండుట చేత నాకు పిత్తమై ఈ రకమైన పలుకులు, నానుండియే వెలువడుచున్నవా? అని తాను సర్దుకొనుచుండగనే కైకేయి మందిరములో జరిగినవిషయము క్షణములో అంతఃపుర మంతయు తెలిసిపోయి, దాసీలు రోదనలుచేయుచూ,

యెక్కడచూచిననూ కంటిధారలు కార్చుచూ, రామచంద్రా ! మమ్ము విడచి వెళ్ళకూడదని కౌసల్యా మందిరమునకు వచ్చుచున్న గుంపులనుచూచి, కౌసల్యకేమియు

అర్థముకాక అశ్చర్యముతో దిగులుతో, దుఃఖముతో, లేలేని స్థితిలో స్తంభించిన దేహముతో ఉన్మత్తురాలై యేమీ మాటాడక, విషయమేమి జరిగినదో తెలుసుకొనగో

రాముని వడిలోచేర్చుకొని, తలనిముర్చ తూ, నాయనా! యేమిటి ఈ వార్త? అసలు యెమిజరిగినదో విశదముగా నాకు తెలిపి నా ఈ బాధను చల్లార్చుము, అని అడుగగనే, రాములు కైకకు యేనాడో యిచ్చిన వరములను పురస్కరించుకొని, కైక ఆ రెండు వరములనూ, నేడు కోరినదట.

( సశేషము )

వైరాగ్యమన్న, రాగద్వేషరహితముగా సమతాభావముతో, ఇష్టానిష్టభావములులేక, మెలగుటయే, కానీ, ఇల్లు వాకిలి విడిచి అరణ్య మధ్యమునకు వెళ్ళుటకాదు. అన్ని పనులనూ భగవత్ప్రీత్యర్థముగా చేసితే, వాటి ఫలితముపై యే కొంచము ఆసక్తి యుండదు. అట్లా భావించి జీవించిన, క్రమ క్రమముగా "నేనూ భగవత్ తత్వ"మే అనే నిజతత్వము వారి వారి మనసులో దృఢమగును. అదే జ్ఞానజ్యోతి, అదే జ్ఞానోదయము; ఆత్మానుభూతి.

బాబా



# ఉపాధ్యాయుల విద్యార్జన

అనంతపురం జిల్లాలోని ఉన్నత పాఠశాలో పాధ్యాయులు తాము పాటించు బోధనావిధానాన్ని, విద్యార్థుల అభ్యాసవిధానాన్ని మెరుగుపరుచుటకు, శిక్షణా పద్ధతులను మరింత సమర్థవంతముగ తీర్చి దిద్దుటకునూ, గత సంవత్సరమునుంచి ఒక 'అధ్యయన మండలి' అధ్వర్యము క్రింద, కృషిసలుపు చున్నారు. ఈ అధ్యయన మండలిచే ప్రకటింప బడిన పుస్తకములను విద్యాభిమానులు యెంతో ఉత్సాహముతో ఆమోదించి ప్రోత్సహించినారు. ఇంతే కాక' పిల్లలు కళా విజ్ఞానశాస్త్రముల ప్రాథమిక శిక్షణమును, ఆట పాటలద్వారా నేర్చుకొని, వాటిలో అభిరుచిని అభివృద్ధి చేసుకొనుటకు దోహద మిచ్చుకొరకు నవీనరీతి "బాలవిహార్" సంస్థయొక్క నమూనాను వారు సిద్ధపరచిరి. జాతీయోన్నతికై, ధార్మికోన్నతికై మనఃపూర్వకమైన శ్రద్ధా భక్తులతో సమర్పణబుద్ధితో శ్రమించు ఈ అధ్యయన మండలిని భగవాన్ శ్రీశ్రీసత్యసాయి బాబావారు ఆశీర్వదించి అనంతపురం బాలికల ఉన్నత పాఠశాలా ఆవరణమున, "బాలవిహార్" అనేసుందర మందిరమును, అధ్యయన మండలికి ఒక పరిపుష్టమైన కేంద్రపుస్తక భండాగారమును· ప్రదానము గావించిరి.

వేలకొలది పౌరులు, ఆంధ్రప్రదేశ్ విద్యా శాఖామాత్యులు శ్రీభాట్టం శ్రీరామమూర్తిగారి అధ్యక్షతన సమావేశమైన మహాసభలో ఆగష్టు12 తేదీన ఉదయం శ్రీవారు "శ్రీసత్యసాయి

బాలవిహార్'' భవనమునకు తమ అమృత హస్తముతో శంకు స్థాపన గావించిరి.

ఆ ఆవరణము నుండి. విద్యామంత్రితో గూడి. శ్రీవారు పుష్పాలంకృత జీప్ వాహనము నధిరోహించి. భక్తులు భజన చేయుచూ ముందు ముందు వచ్చుచుండగ. నాదస్వరవాయిద్యాలు మిన్నుముటగ. పౌరుల జై జై కారములు ప్రజలహృదయముల నుప్పొంగింపగా. నగరముయొక్క ముఖ్యవీధులగుండా వూరేగింపుతో స్టేడియమునకు విజయము చేసిరి.

భారత స్వాతంత్ర్యదిన రజతోత్సవ సందర్భమున అధ్యయన మండలి యేర్పాటు జేసిన ''చిల్డ్రన్స్ ర్యాలి'' ని శ్రీవారు అవలోకించి ఆశీర్వదించిరి. జిల్లాలోని పాఠశాలల బాలబాలికలు వేలకు వేలు ర్యాలిలో చేరి. వ్యాయామ ప్రదర్శనములు, నృత్యములు గ్రామీణ ఆట పాటలు, సామూహిక డ్రిల్లు మొదలైన కార్యక్రమములలో భక్తి శ్రద్ధలతో ఉత్తమ రీతిని పాల్గొనిరి. శ్రీవారు పిల్లలనూ, వారికి శిక్షణ ఇచ్చిన ఉపాధ్యాయులనూ అభినందించిరి. తల్లితండ్రులకు మీ విజ్ఞాన విచక్షణలు అభివృద్ధి పొందాలి అనే ఆశ ఆతురత, యెంత సహజమో, భారతమాతకు మీ ధార్మిక ఆధ్యాత్మిక అభివృద్ధి. మీ వినయము మీ సత్ శీలము సత్ చింతన సత్ ప్రవర్తనల అభివృద్ధి కొరకు అదే రీతి ఆశ ఆతురత ఉంటుంది, అన్నారు శ్రీవారు.

సాయంకాలము, 4 గం॥కు జూనియర్ కాలేజి సభామందిరమందు జరిగిన అధ్యయన మండలియొక్క విశేష సమావే

కము శ్రీవారి దివ్యసన్నిధిన జరిగినది. విద్యా శాఖామాత్యులు అధ్యక్షత వహించిరి. విద్యా ఇలాఖా డైరెక్టర్‌గారూ జిల్లాపరిష దధ్యక్షులూ వచ్చియుండిరి. షుమారు 500 ఉపాధ్యాయులు సభా కార్యక్రమములో పాల్గొనిరి.

మంత్రిగారు. ''ఈ జిల్లాలో భగవాన్ శ్రీసత్యసాయిబాబా వారు అవతరించటము మీరంతా గర్వింపతగిన విషయము; కానీ. భగవానులు యే ఒక దేశానికి మాత్రము చెందినవారుకారు; వారు సమస్త మానవకోటిని వుద్ధరించే కొరకు లోకకళ్యాణమున స్థాపించే కొరకు అవతరించి యున్నారు. మీ నూతన బోధనా క్రిమ ప్రచారకార్యమునకు, వారిఆశిస్సులే పునాదిరాయి'' అన్నారు. డైరెక్టర్‌గారు ఉపన్యసించుచూ, శ్రీవారు ప్రదానము చేసిన పుస్తక భండారమును ఉపాధ్యాయులు శ్రద్ధతో ఉపయోగించి తమ వృత్తిని మరింత ప్రియోజనాకారిగా ఫలప్రదముగా చేసుకొనవలెనని ఉపదేశించిరి. భగవానులచే పొందు పరచబడిన అపారమైన అద్వితీయమైన శిక్షణశాస్త్ర లైబ్రరియొక్క విలువను తెలుసుకొని, తమ విద్యా ప్రమాణమును పెంపొందించ వలసిన అవసర మెంతైనావుందని నొక్కిచెప్పిరి.

మండలి సభ్యులు వారుసమర్పించిన విజ్ఞాపనా పత్రములో ''మా ఉద్యమమును భగవానులు ఆశీర్వదించినారు. మాకు దైవ బలము దొరికినది. ఇంకమాకు కరువేమున్నది? మంచి భావన లతో సేవాబుద్ధితో అర్పణ భావముతో చేసే పనులన్నిటికీ, మానవ సహాయముల హద్దులను మీరి దైవమే కృపాహస్తమును

కరుణించును అనిమాకు దృఢమైనది'' అన్నారు. శ్రీవారు తమ దివ్యోపన్యాసము ననుగ్రహించుచూ;

ప్రచండ మారుతమువలె కాలము అతివేగముగా కదలి పోవుచున్నది; మంచు గడ్డవలె ఆయుష్కాలము కరగి పోవు చున్నది; అయిననూ, తానుజన్మించి జీవించి నిర్వహించవలసిన కర్తవ్యమునే మానవుడు గుర్తించి వర్తించక, వెళ్లిపోవుచు న్నాడు. ఇదొక శోచనీయ పరిస్థితి, అని అనిరి.

మీరు విద్యా బోధకులు; ఉపాధ్యాయులు: చక్కని శిల్పుల వంటివాళ్ళు. కొండలోని గుండు బండలను తీర్చిదిద్ది గుడిలో ప్రతి ష్ఠించే అర్హతను వాటికనుగ్రహింపగల శక్తిసామర్థ్యములుశిల్పుల కున్నవి, అట్లనే, మీ దగ్గర విద్యార్జనకొరకు వచ్చే పిల్లలకు విజ్ఞాన సుజ్ఞాన ప్రజ్ఞానములననుగ్రహించి వారి మానవత్వమును సార్థ కముచేసే పవిత్రసేవ మీది, బాలబాలికల హృదయములలో ప్రేమ బీజములను నాటి సహనప్రసూనములను పెంచి శాంతిఫలములను పరమాత్మునికి అర్పించేదే ఉపాధ్యాయులు చేయవలసిన కర్తవ్యము, అనాది కాలమునుండి, వేదవిహిత కర్మలనాచరించి దైవప్రీతి పాపభీతులనభివృద్ధి చేసికొని మహర్షులు తమ మతిని మథించి శేఖరించిన సుధానిధియైన సనాతన ధర్మపద్ధతులన్నీ ఈనాడు క్షీణించి, కేవలము మాటలో మాత్రము నిలచి, ఆచరణలో శూన్య మైయున్నది, చెప్పుమాటలకూ చేసేపనులకూ యే మాత్రమూ పొంది కలేకున్నది, సమరమును స్వాగతించుచూ శాంతిసభలను జరుపుచు న్నారు, అర్థములేని వ్యర్థపుపనులలోనే కాలమును గడుపుచున్నారు,

మంత్రిగారు సత్యాన్వేషణయే మానవునికి నిత్యకృత్యమన్నారు. సత్యమును అన్వేషింపనక్కరలేదు; అందరూ సత్యస్వరూపులే కాబట్టి, సత్యమందరికీ సులభవేద్యమే. దొంగకు తెలుసు తాను సత్యదూరుడై దొంగతనము చేసినానని సత్యస్వరూపుడని తెలిసికొని, మనసా వాచా కర్మణా, ఆ సత్యమును ప్రకటన చేసితే సత్యజ్యోతియొక్క సహజ ప్రకాశమునకు అడ్డుచేయక, కర్తవ్యమును నిర్వర్తించినట్లగును.

పిల్లలను బయటవాళ్ళుగా తలంచక, మనవాళ్ళుగా ప్రేమించి, సరైన తరిఫీదునిచ్చి, మంచి ప్రజలుగా తయారుచేయండి. పిల్లలలో యేమీ దోషములేదు. తల్లిదండ్రులు ఉపాధ్యాయులు సరైన మార్గముతో వారిని పెంచిపోషించాలి. పిల్లల తెలివి తేటలు మహాసూక్ష్మమైనవి. మీరు ఆచరించకపోతే, మీరు బోధించే విషయములకు వారు ఒప్పుకోరు.

ఇంత శ్రమపడి ఉత్తమ శిక్షణపద్ధతులను కనిపెట్టిన తరువాత డైరక్టర్‌గారు చెప్పునట్లు, మీరే వాటిని ఆచరించి అనుసరించి ఫలితము నందుకోవలెను. మరొకటి: పిల్లల తల్లిదండ్రులనుకూడ మాసముకొక పర్యాయముకానీ, రెండు పర్యాయములు కానీ కలసికొని, వారిద్వారా పిల్లలపరిస్థితి, వారి శక్తిసామర్థ్యములు, వారి వినయవిధేయతలు, వారి శీలసంపత్తు యెంతమాత్రము అభివృద్ధి అయినవి అని కనుగొనుటకు పూనుకోవలెను. మీ కాను బిడ్డలను మీరు పోషించి లాలించి అభివృద్ధికి తెచ్చినట్టే, మీ ప్రేమ బిడ్డలైన విద్యార్థులనూ తీర్చిదిద్దటానికి ప్రయత్నించవలెను,

ఈనాడు భారతదేశములోమాత్రమే కాకుండా, అన్యాయ అక్రమ అసత్యములు పైశాచిక స్వరూపముదాల్చి ప్రళయతాండవ మొనర్చటమువలన, ప్రపంచమంతా భయభ్రాంతులతో బాధపడు చున్నది. విద్యార్థులపై అధికారస్థానమునుపొందిన మీరు మీ జీవితమును బిడ్డల అభివృద్ధికోసము అర్పించిన, లోకకళ్యాణమేర్పడును ఏ పనిచేసినా ఏ చూపుచూచినా, ఏ తలంపుతలచినా, ప్రేమను పెంచండి. ప్రేమభావమును పెంచకపోతే ప్రపంచమంతా ప్రళయస్వరూపము కాకతప్పదు. మతిని చక్కచేయుకొరకు మతము కావలెను. మతములన్నిటికన్న ప్రేమమతమే ఉత్తమమైనది. Love is God; Live in Love అనేదే మీ జీవితసూత్రముగా వుండవలెను.

కొంతలోతుగా విచారణ జరిపిన, ఉపాధ్యాయులైన మీరే నిజమైన విద్యార్థులు. మీ విద్యార్థులు యేదో యెనిమిది పది సంవత్సరములు గ్రంథములను చదువుకొని డిగ్రీలనందుకొని నౌకరీలలో చేరిపోతారు. అయితే, జీవితమంతా తీరని చదువు మీదే ! జీవితమంతా విద్యనందించి, విద్యనందుకొని ఆనందించేది మీరే ! దిల్ మే రాం, హాత్ మే కాం, అన్నాడు. కవి. అన్నీ రామకార్యములే. అన్నీ భగవత్ కైంకర్యములే, భగవంతుని బిడ్డలసేవనే !

ఈ పవిత్ర భావములను మీ హృదయములలో నింపుకొని, భారతీయుల ప్రత్యేక ఆస్తి అయిన త్యాగశీలము, సహన, సమరసము. వీటిని మీ వాక్కులద్వారా, క్రియలద్వారా, తలంపులద్వారా పిల్లలకు అందించండి. Do Good; Be Good· See Good

వట్టిమాటలతో ఫలములేదు. మీరు నడచవలెను; మీరు చేయవలెను: యేడ్చే బిడ్డను పరుగెత్తివచ్చి నడుమువంచి యెత్తుకొంటుంది తల్లి. ఆ బిడ్డ, నాకు లొంగినది. అమ్మ. అని అనుకోవచ్చు! అయితే. ఆ లొంగటము తల్లి బలహీనతవలనకాదు. బిడ్డయొక్క అధికార మువలన కాదు. అది ప్రేమతత్వమే! అంతియే. మీరుకూడ పిల్లలను తీర్చిదిద్ది. వారిని వాత్సల్యముతో ప్రేమించి అభివృద్ధికి తీసుకొని రావలెను.

గురు అనే పవిత్రనామమును మీకు అందించినారు పెద్ద లు. గురుసాక్షాత్ పరబ్రహ్మ. అనేవరకూ గురువులను గౌరవించి వడి ఈ దేశము. ఆ గురుత్వమునకు తగురీతిగా వర్తించి సేవచేయ వలెను.

మానవత్వము రూపముతోమాత్రము విరూపణచేసిన చాల దు. ఏనుగుకు రెండు కొమ్ములున్నాయి: యెనుముగొడ్డుకూ రెండు కొమ్ములున్నాయి. అయితే. అవిరెండూ సమమా? క్రియాత్మక ముగా మానవత్వమును నిరూపించవలెను. జనన మరణ చక్రము నుంచి తప్పించుకొని. ఆత్మసాక్షాత్కారము నందుకోవాలి. అదే జన్మసార్థకత.

ప్రధానమైన ఈ ఘనకార్యమును సాధించవలెనన్న. దానికి గురువు అత్యవసరము. పూలు సూది దారము అన్నీవుండిన. పుష్ప మాల తయారగునా? కుట్టేవారొక్కరు కావలెను. కదా? స్వర్ణ ము రత్నములుమాత్రముండిన సొమ్ములు తయారగునా? ప్రమిద నూనె వత్తి మూడు వుండినమాత్రాన దీపము వెలుగునా ముట్టి

చ్చేవాళ్ళెక్కరు లేక ? అట్లనే ఇచ్ఛ వుండవచ్చు. బుద్ధి యుండ వచ్చు; గురువులేక, జ్ఞానము కలుగదు. విద్యార్థుల బుద్ధిశక్తి చురుకుగానుండిననూ, ఉపాధ్యాయుని మనసులో ఉత్సాహము ప్రేమ లేకపోతే. విద్యాభివృద్ధి కుదురదు ఉపాధ్యాయులకు యెంత తెలివి యెంత వాత్సల్యముండిననూ, విద్యార్థిమనస్సు బండవలె యుండిన యేమీ లాభములేదు, నాకర్తవ్యమును నేను సంపూర్ణముగా నిర్వహించాను అనే ఆత్మతృప్తి (Self Satisfaction) ఉపాధ్యాయుడు సంపాదించుకోవలెను.

ధనమును దానముచేయుటకు వీలులేకపోవచ్చు; వస్తువాహనములను దానము చేయుటకు సాధ్యముకాకపోవచ్చు, అయితే, వీటికన్నిటికన్న విలువైన విద్యను దానముచేసే భాగ్యము అవకాశము మీకు దొరకినది. ఇది అతిప్రధానమైనకర్మ ! గొప్ప ఉపకారకార్యము ! దీనివలన, మీ గ్రామములను మీ దేశమును నిత్యకల్యాణముగా పచ్చతోరణముతో సౌభాగ్యవంతముగా తయారుచేసే అవకాశమున్నది.

ఇంకొకవిషయము: మీరు స్థాపించి చక్కగా జరుపించే ఈ అధ్యయనమండలి చేయవలసిన అభివృద్ధికార్యములు ఇంకెన్నో వున్నాయి. అయితే, దానికొరకు మీరు వేదికపైకూర్చున్న వాళ్ళందరిసీ ఈరీతి పంచరత్నములు కుసుమాంజలి అడ్రెస్సులు వీటి ద్వారా వర్ణింపనక్కరలేదు, అవన్నీ బాధ్యతలేనివర్ణన ! వినే వాళ్ళుకూడ దానిపై విశ్వాసముతో శ్రద్ధతో వినరు, ఇదొక అర్థము లేని సాంప్రదాయమని అందరికీ తెలుసు. మీకు అడుగుటకు హక్కుంది; మనకు చేసేహక్కుంది. ఇంక ఈ అర్థములేని

వర్ణించటం యెందుకు? ఈ సాంప్రదాయమును మీరు పూర్తి మానుకోవలెను. హక్కులు పెంచుకొని చిక్కులు తీర్చుకొనండి. మీ వర్ణలను వింటే ఆ వర్ణింపబడినవ్యక్తికే ఆశ్చర్యంగానూ అవ మానముగానూ వుంటుంది.

మీరందరూ. ఉపాధ్యాయులుకాబట్టి మరొక విషయము చెప్పకతప్పదు. మనదేశము లౌకికముగా భౌతికముగా చాలా అభి వృద్ధి చెందినది. సరే. అయితే. ధార్మికముగా ఆధ్యాత్మికముగా కూడా అభివృద్ధి కాకపోతే దేశములో శాంతిభద్రతలు పూర్తిగా లభించవు. ఇదే నాయొక్క ప్రధాన ఆశయం. దీనికొరకే. నేను విద్యారంగమున ప్రవేశించి తద్వారా పిల్లలలో యువకతరాలలో. ఆధ్యాత్మిక చింతన. సత్ప్రవర్తన. సేవామనోభావము. సర్వ సమానప్రేమ. వీటిని అభివృద్ధిచేసి ఆనందమునందించి అందు కొనుచున్నాను.

భారతదేశము త్యాగభూమి. యోగభూమి. కర్మభూమి. ప్రామాణికమైన త్యాగమునాచరించి తపములో మునిగిన మహాత్ము లెన్నో మనదేశములోనే వుండగ పిల్లలకు జాన్‌సన్ మిల్ అనే పరసంస్కృతివాళ్ళ వాక్యాలనెందుకు నేర్పాలి? పిల్లలకు ఈవాడు యే మద్రాసులోనో బొంబాయిలోనో నివసించే సినిమానటుల అడ్రెసులంతా తెలుసునే కానీ. పక్కింటిలో నివసించే పండితుల పేర్లు తెలియదు! ఇతరులపై దండెత్తిపోయే మనోభావాలు ఉద్రే కాలు పెరుగుతున్నాయి. కానీ, దీనివలన ప్రమాదములే కష్టనష్టము లే పెరుగును. తనపై దండెత్తాలి. తన్ను తీర్చిదిద్దుకోవలెను. అనే ఆశయము ఉత్సాహము అభివృద్ధికావలెను'' అని బోధించిరి.

# 1943-1972



ఔనా? కాదా? 16 సంవత్సరాల సాయిబాబా అనే బాలుడు ప్రజల సందేహాలకు సరైన సమాధానం ఇస్తున్నాడు: రోగపీడుతులకు పిచ్చి వాళ్లకు, పిశాచులు మొదలగు దుష్టగ్రహాలతో బాధపడే దీనులకు, వాని దర్శన సంభాషణ స్పర్శతోనే నివారణ అవుతుందని వినికిడివలన 1943 వ సంవత్సరమున, రెండు సంవత్సరాలుగా పిచ్చిపట్టినఅమ్మాయి, ఆమెభర్తతో, పుట్టపర్తికిప్రయాణమయ్యాను.

అప్పటికి, పుట్టపర్తిపేరు అంతగా యెవరూ కని విని యెరుగరు. ఊరు చేరడానికి రైలుకానీ బస్సులుకానీ ఇతర సదుపాయములు కానీ లేవు. అది సుమారు వందఇండ్లతో వున్న ఒక చిన్న పల్లెటూరు.

మేము బుక్కపట్నం చేరితిమి. అచ్చటున్నవారు ఆ బాలుని గురించి ఇచ్చే వర్ణనవిని, నాకు సంశయము బయలు దేరినది. మీకెవరో రాంగ్ ఇన్‌ఫర్మేషన్ ఇచ్చారు, అని ఒక ఉద్యోగి నాకు సలహా ఇచ్చాడు, నేనొక నిట్టూర్పు విడచి అయోమయంలో పడి పొయ్యాను.

సరె. ఇంత దూరమే వచ్చాను; ఇచ్చటికి పుట్టపర్తి రెండు న్నరమైలేగా? యధార్థాన్ని కనుక్కొనే పోదా ; చెప్పుడు మాటలు మన సంశయాన్ని హరించవు, అని అచ్చటికి ఒక రెండెద్దుల బండిని విచారిస్తిమి. స్వామి, స్వామి, బండి నే కడతాను, నేకడుతాను, అని ఒకరిమీద ఒకరు కాంపిటీషన్ చేసి, పర్తికి సామానులతో చేర్చడానికి మూడు పావులాలుకు ఒప్పుకొన్నారు, చిత్రావతి యేటివొడ్డుకు వచ్చాము.

నా స్నేహితున్ని, అతనిబుద్ధి చెడిన భార్యనూ స్నానానికి

వదలి నేనుమాత్రం ముందుగా ఆ అబ్బాయి విషయ మేమిటో కనుక్కుందాం అని పల్లెదారి నడిచాను. ఊరి చుట్టూ పాము పుటలు, ముండ్లు కంచెలు మురికి గుంటలు.

నేను ఒక సందులో ప్రవేశించాను. ఒక బ్రాహ్మణుని ఇల్లు కనబడ్డది. (అదే, కర్ణం సుబ్బమ్మగారిది అని తరువాత తెలిసినది.) ఆ యింటి ఆవరణములో వేరుశనక్కాయల పంట అప్పుడే వచ్చినది కాబోలు!

ఆ ఇంటిలో ఒక సుందరుడైన బాబు నీటుగా డ్రెస్ చేసుకొని కూలీలతో ప్రసంగిస్తున్నాడు. బహుశా ఆ యింటి యజమాని కుమారుడై యుంటాడని. అతన్ని సమీపించి, నాయనా! ఈ ఊళ్ళోపదహారేళ్ళ కుర్రాడు సాయిబాబాను అంటాడటే, భవిష్యం చెబుతాడటే, మరి జాయిలాలు బాగుచేస్తాడటే! వారిల్లెక్కడ? అని ప్రశ్నించాను.

ఆ అబ్బాయి నావైపు జాలిచూపులు యెందుకు చూచాడో తెలియదు. పాపం! నీవుతీసుకొచ్చిన పిచ్చిఅమ్మాయి యేట్లో భర్తకుచాలా తొందరిస్తుంది. వారిద్దరినీ స్నానముచేయించి, నీవు స్నానముచేసివస్తే ఆ అబ్బాయిని చూపెడ్తా అన్నాడు.

ఆ వార్త, ఆ సమాధానం వినంగనే నా వొళ్ళు గుగుర్లు పొడచి మాటాడే దానికే నోరాడలేదు.

యేం? మీతోవచ్చిన భూతం ఆలస్యంగా వచ్చిందా? అని తిరిగి ప్రశ్నించాడు: నాకర్థం కాలేదు.

ఆ సుందరబాబు నాకుఒక మెరుపుతీగలాగకనుపించాడు. పూర్ణచంద్రుణ్ణి మించిన ముఖారవిందం నన్నాకర్షించింది; నేను కదలలేదు. "ఊ! పోయి తొందరగారా, అబ్బాయి!" అని సంబోధించాడు. ముద్దుల మూటగట్టే పలుకులు! ఏమిటీ విచిత్రం అని మనస్సులో అనుకుంటూ యేటికొచ్చి చూడగా, నా స్నేహితునిభార్య ముందుపరుగెత్తడం! భర్త ఆమె వెనుక అరచుకుంటూ వెంబడిం

చాడు, ఈ దృశ్యాన్ని చూచాను.

కడకు స్నానముచేసి, 5 గంటలకు వారియిల్లు ప్రవేశిస్తూండగ, ఆ పూరికాపురస్తులు పిల్లలు మొదలు పెద్దలువరకూ, తదేక దృష్టితో, యెవరింటి కొచ్చారని మావెంట బడ్డారు. స్వామివారు ఒక్కొక్కరిని పిలుస్తానని నన్ను మొదటపిలిచి తమహస్తాన్నిత్రిప్పి విభూతితెప్పించి నా నొసట వ్రాపి నా భవిష్యత్తును గురించి చెప్పారు.

అటుపిమ్మట, భార్యాభర్తలు వారిద్దరినీ పిలిచారు. రిక్తహస్తాలతో పోకూడదని వారు బుక్కపట్నంలో తీసుకొచ్చిన పండ్లలో ఒకపండును ఆ అమ్మాయికి తినమని ఇచ్చారు. మరి, విభూతితెప్పించి ఆమెనోటిలోవేసి, ఇకమీరు వెళ్లొచ్చు, అని ఆజ్ఞ చేశారు. అప్పటికి సాయంత్రం ఆరుగంటలు. మేము ఆ యింటిబయట నిల్చున్నాం. ఆ పిచ్చిపట్టిన అమ్మాయికి పునర్జన్మ ప్రాప్తించినట్లు మాదగ్గరవచ్చి, తనభర్తతో ఇలాగన్నది' యేమండీ ఈ రాత్రికి భోజనం ఎట్లాగ? మీరు బియ్యం పట్టుకొస్తే, వీరినిఅడిగి, పాత్రలుతీసుకొని, వంటచేస్తానే! అని అన్నది.

ఇది భర్తకు ఆశ్చర్యము, ఆనందము! రెండు సంవత్సరములకిత్రం ఈ సంభాషణవిన్నాను; మరియిప్పుడు వింటున్నాను! ఇదిస్వప్నమా? లేకనిజంగా ఈమెకు పిచ్చిపోయిందా? అని సందేహంగా మాటాడుతూండగనే, లోపలనుండి ఆ సుందర బాలు, ముసిముసినవ్వులతో బయటవచ్చి'' మీ భోజనము తయారైంది ఇకమీరు ఉపయోగించుకోవచ్చు'' అని నా స్నేహితునితో చెప్పాడు.

ఆ రాత్రి సుబ్బమ్మగారింట్లో మాకు భోజనము. స్వామి మాతో పాటు భోజనానికి కూర్చున్నారు. వెండి పళ్లెరాలలో సుబ్బమ్మగారు కూరలతో సహావడ్డించారు. స్వామివారుమాత్రం తనకువడ్డించిన అన్ని పదార్థములనూ ఒకే సారి ముద్దగా కలిపి మాకు ఒక్కొక్కరికి ఒక్కొక్క ముద్దనువడ్డించి భోంచేయమని

ఆజ్ఞచేశారు. దావిరుచి అమోఘం: అమృతం.

సుబ్బమ్మగారింటి పంచటుగుపైన మా పడకవేశాం, నిద్దురపటలేదు. ఆ వూరిదాపులో కొండఅడవికాదూ, నక్కల కూతలు భయంకరంగా చెవినిబడ్డాయి. రెండు గంటలకు హఠాత్తు.గా చంపు: చంపు! పోనీక: అనే కేకలు వినబడ్డాయి. విచారిస్తే . పెద్ద సర్పాన్ని చంపారు. మూడుగంటలకు ఒక్కా విడ బిగ్గరగా కేకవేసింది: "అయ్యో! చచ్చాను! చచ్చానమ్మ చచ్చాను!" ఆవిపేద్వటానికి మొదలుపెటినది. ఉలికిపడిలేచాను. విచారిస్తే, మండ్రగప్ప కరచినదట.

ప్రొద్దున్నే స్వామిని దర్శించాం. ఈ వూరుచాలా పుణ్య వంతమైనది; కానీ శాపగ్రస్తముతో ఇలాగమాతినది; ఇదికొండ సమీపములో వుంది. కనుక రాత్రిమీరు విన్నశబ్దములు అప్పు డప్పుడు, భక్తాదులను కలవర పరుస్తూంటాయి. కానీ సాయినా మముతో అవియేమీ చేయలేవు. సాయిప్రవేశముతోఇది ప్రశాంతి ప్రదేశముగా మారుతుంది. ఈ కొండపైన పెద్ద భవనమేర్పర చుతాను. అచ్చటికి, పందలు, వందలేమిటి, వేలు వేలేమిటి, లక్షలు ఆల్ ఇండియా వస్తూంది. ఆల్ ఇండియా యేమిటి ప్రపంచమంత యూ వచ్చి, సాయిదర్శనానికి దాసానుదాసులుగా కాచుకుంటారు! అని సెలవిచ్చిరి.

"నాకునమ్మకములేదు" అన్నాను. ఉండు! అప్పుడు అంత దూరమునుండి దర్శనం కోసం తహ తహ లాడేటప్పుడు, నీకు నమ్మకము వస్తుంది, అని దానికి సమాదాన మిచ్చినారు.

1972! ఇప్పుడు కొండంత పెద్దపెద్ద భవనములు! ప్రపం చమంతా పుట్టపర్తికి వస్తూన్నది నేను దూరమునుంచే, స్వామి దర్శనము కొరకు తహ తహ లాడుచున్నాను. 1943 సం॥లో స్వామి సెలవిచ్చిన మాటలలో నమ్మకము వచ్చినది. భగవానుల దివ్యవచనములు, ఒక్క సారి వారు ఉచ్చరించిన, అమృతవాక్కులు! యెప్పటికీ వృథాకావు.

పూజారి లక్ష్మయ్య

# నేను ఒక నిదర్శనము

## స్వవిషయము

నా స్వవిషయమును కొంచము సూక్ష్మముగా మొదట తెలియ జేసెదను. నేను నాస్తికుడను కాను. నానమ్మకములు అద్వైత సిద్ధాంతమునకు అనుగుణముగా యున్నప్పటికిని నాకు అనిశ్చయ మైన సూత్రములను వల్లించుటలో తృప్తిలేదు; నేను కర్మిష్ఠిని. సక్రమమైన పద్ధతిలో నమ్మకముతో కర్మలను అనుసరించిన యెడల తప్పక ఫలవంత మగునని నాఅనుభవ పూర్వకమైన విశ్వాసము. కొన్నితరహాల మనస్తత్వానికి అది అవసరమని కూడా నాఅభిప్రాయము. నలుబదిఆరు సంవత్సరముల వెనుక నాకు ఒక మిత్రునికి సాధన సిద్ధులను గురించి వక వాగ్వివా దము జరిగినది. పతంజలి యోగసూత్రములలో వివరించిన అసాధారణ సిద్ధులను గురించి కూడా మేము తర్కించు కున్నాము. నామిత్రునకు యీవిషయము అంతనచ్చలేదు కాని నేను మాత్రము చాలా ఉత్సాహముతో వాదించినాను. కాలము దొర్లిన కొలది నానమ్మకము దృఢపడుతూ వచ్చినది. చిన్నచిన్న అనుభవముల మీద, బాగాఆలోచించిన మీదటనే యీనమ్మిక నాలో దృఢమైనది.

నావ్యక్తిత్వపు మరోకవైపు: విశ్వవిద్యాలయపు చదువు ప్రకృతి శాస్త్రము, గణితశాస్త్రము చదివితిని, వాటి అభిరుచిని

నాజీవితములో అభివృద్ధి పరచుకున్నాను. వీటితోపాటుగా సనాతన వేదాంతజ్ఞానము, పాశ్చాత్యుల వేదాంత విషయ జ్ఞానార్జన కూడ చేసినాను. నాకుమేధావులయెడ యెనలేని అభిమానము. అధ్యాత్మిక పేర ఆ గౌరవమును వదులుకొనలేను. ఆధ్యాత్మికము--బుద్ధివాదము వీటిమధ్య శాంతియుత సహజీవనము కుదురదని, సర్వసాధారణఅభిప్రాయము. ఒకటి వదలుతేనే కాని రెండవది చిక్కదని, ఇది అసలు వివాదాస్పద విషయము; సందిగ్ధ పరిస్థితి. కానీ ఈరెండిటిలోనూ దేనికీ అతి ప్రాముఖ్యత యివ్వకుండ దేనినీ వ్యతిరేకించక మధ్యమార్గమొకటి నాకు గోచరించుచున్నది. దానిని గురించి నేను ప్రస్తుతము స్ఫుటముగా వ్యక్తము చేయలేనుగాని ఆమార్గమును నేను తప్పక తెలుసుకొనగలనని నాకు గట్టినమ్మకముకలదు. ఆ సుదినము బహుశా అంత దూరములో లేదని నా భావము.

## మహిమల వినికిడి

ఇంక అసలు విషయము ప్రస్తావించెదను. చాల సంవత్సరములనుండి శ్రీసత్యసాయిబాబాగారిని గురించి వారి మహిమలమా వినుచున్నాను. మహిమలు సంభవమేనని నేను విశ్వసించిననూ ఏమాత్రన సంఘటన నైననూ అనుమానించుట నానైజము. బాబాగారివిషయములో కూడ అదియే జరిగినది. వారు చూపెడి మహిమల వలన అనేక మంది వారిచేత ఆకర్షింపబడుచున్నారనే భావమే నన్ను ఆయన దరికి చేరవివ్వలేదు. ''మహిమలు ప్రదర్శించకుండ వుండినయెడల నేను బాబావారివద్దకు

వెళ్ళవుండేవాడిని'' అని నేను చెప్పుతూ వుండెడివాడిని. నా బంధువులు, స్నేహితులు తరుచు బాబావారి వద్దకు వెళ్ళుచుండెడి వారు. వారి మహిమలను గురించి వారి అనుభవములను వర్ణించుచూ యుండెడివారు. నేను వాటినిగురించి వినెడి వాని కాని వాటిని హేళనగా తలచెడివాడను. 1972ఏప్రియల్ వరకూ నాభావముయిదియే। డా॥ భగవంతం వంటి శాస్త్రవేత్త, డా॥ గోకాక్ లాంటి విద్యావేత్త మొదలగువారిని చూచిన, గొప్ప మేధావులలో కూడా ఇటువంటి బలహీనతకు తావుకలదని నేను అనుకుంటూ వుండేవాడిని.

## నీటిదగ్గరకు గుఱ్ఱము

1972 మే నెలలో శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ ట్రస్టువారు వైట్‌ఫీల్డు బృందావనమందు నడుపబోవు వేసవి తరుగతులలో శాస్త్రీయమును గురించి, భారతీయ సంస్కృతిని గురించి మాటాడమని డా॥ గోకాక్ నాకు స్వయముగా జాబువ్రాసినారు, వెంటనే అంగీకరించినాను. ఆతరగతులకు బెంగుళూరు యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ శ్రీతుకోల్‌గారు ప్రారంభోత్సవము జరుపుదురు. ఆదివారము సాయంత్రము చాలా ప్రొద్దుపోయిన తరువాత నాకు ఆహ్వానము ఎక్స్‌ప్రెస్ డిలివరి లెటరుద్వారా అందినది. మర్నాడు ఉదయమే ఆ వుత్సవము. నాకు నిర్ణయించబడిన, 25-27తారీకులకు హాజరైనచాలు, ఈవుత్సవమునకు పోనక్కరలేదని తెలిపితిని. కానీ నాభార్య పట్టుదల వలన నేను సభకు బయలుదేరితిని. నావూహా పీగిపోయినది ఆమెనెగ్గినది. ఇష్టములేని గుఱ్ఱమును నీటిదగ్గరకు

తీసుకొని వెళ్ళినట్లు వుంది నాస్థితి అక్కడ. భారతదేశపు నలు మూలలనుండి సుమారు మూడునూర్లమంది విద్యార్థులు అక్కడకు చేరిరి. ప్రతి విద్యార్థిబృందమునకు ఒకఉపాధ్యాయ పర్యవేక్షకుడు కలడు. బాబావారి నివాసగృహమునకు వెనుక భాగమున నున్న వేదిక వద్దకు వూరేగింపు బయలుదేరినది. వేదిక చూడ ముచ్చటగ అలంక రించినారు. శ్రీతుకోల్‌గారు. G.P. రాజరత్నంగారు. Retd జస్టిస్. గోపీవల్లభఅయ్యంగారు, ఇంకా మరికొందరు. బాబావారి బంగళాద్వారమువద్ద వేచియున్నాము. ఎండ తీక్షణముగా వుండు టవల్ల అక్కడ మాకందించిన చల్లనిపానీయములను అతితృప్తిగా అందుకున్నాము. నేను ఖాళీగ్లాసును కిటికీగూటిలో పెట్టుచుండగా అలికిడిప్రారంభమైనది. బాబావారు అతిథులమధ్య తిరుగుతూ సమ్మో హనకరమైన తమదృష్టిసారించుచూ, చకచక వడుచుచుండిరి బాబావారు చాలాముక్తసరిగా మృదువుగా అందరినీ పలుకరించిరి. ఆ ప్రేమపూరిత మందస్మితమూ, అతిప్రత్యేకమైన ఆ నేత్రతేజ ము వర్ణింప నలవికాని సందేశము నందించుచున్నవా అన్నట్లు వున్నవి.

### కల నిజమైనది

సాంప్రదాయ పద్ధతిలో ముందుకువంగి నమస్కరించితిని. నాలో ఏదో ప్రేరణ కలిగి నమస్కరించితిని. నాకేఆశ్చర్యమైనది. అశ్రద్ధతో అజాగ్రత్తగా నమస్కరించవద్దని నాకు యింట్లో వారు హెచ్చరించిరి, ఆహెచ్చరిక అనవసరమే, ఏదో అవ్యక్తమైన శక్తి నన్ను ప్రోత్సహించినది. బాబావారు నారెండుభుజములపైన నన్ను

లేవనెత్తుతున్నారా అన్నట్లుగా తమచేతులువేసినారు. నాకు మెరుపు మెరిచినట్లు పూర్వము రెండునెలలక్రింద కలలో కనబడిన దృశ్యము జ్ఞాపకమువచ్చినది. ఆకల పూర్తిగా మరచిపోతిని. కలలో బాబావారు వున్నవొక సభలో నేను కూడ యుంటిని. నేనువొంగి వారి పాదాభివందనము చేయుచున్నట్లు. వారు నన్ను భుజముమీద చేయివేసి లేవనెత్తినట్లు కలచూచితిని. ఈకలను మాయింటిలో అందరికీ తెలియజేసితిని. ఇట్టిసంఘటన నానిజజీవితములో ఎన్నడూ జరుగదని కూడా వారితో అన్నాను. నా కలలో చూచినది అక్షరాలా జరిగినప్పుడు నాకు దిగ్భ్రమ కలిగినది; మేనుపులకరించినది. నా మొదటి అనుభవము నా మనస్సులో మాయని ముద్ర అయి నిలచినది. చెరగనిచిత్రమైనది.

నాఊహాచిత్రమునకూ ప్రత్యక్షముగా బాబావారిని చూచిన దానికినీ పోలికయే లేదు. బాబావారు తమ కదలికలో ఆకారములో చిన్నపిల్లవానివలె అగుపడినారు, చిత్రపటములలో చాలవిచిత్రముగా అసహజముగా కనబడు ఆయన కేశములు సాధారణముగాను. సుందరముగాను కనబడినవి. వారిని చూచుచున్నప్పుడు యివిఏవీ జ్ఞాపకమునకు రానేరావు. వారిలో ప్రతిష్ఠ కనబడలేదు; అలాని చులకనగానూలేరు ప్రతివారిని సునాయాసముగా ఆకర్షించు సౌమ్యత ఆయన వద్దయున్నది; ఎవరూ వారివద్ద చనువుగా వుండలేరు. అలాఅనిభయపడుటయూలేదు. అదియొక వింతశక్తియే. వారితోచాలా సన్నిహితముగా మసలువారూ, వారిని భయభీతులతో పూజనీయులుగా యెంచువారే, అందరూ వారిముందు ముగ్ధులై

పోయెదరు, ఇది తలచినప్పుడు నాకు ఉపనిషత్తులలో బ్రహ్మ నుగురించి తెలిపినవాక్యము జ్ఞప్తికివచ్చును. బ్రహ్మతత్వము వకే సారి అతిచేరువ అతిదూరమైనట్లు, బాబావారునూ.

## ప్రారంభోత్సవము

ప్రారంభోత్సవమును గురించి కూడా కొద్దిగా తెలియజే సెదను. పందిరి చాలాసుందరముగా అలంకరించిరి. ప్రతిచిన్న పని కూడా బాబావారి ఆజమాయిషిరోనే జరిగినదని నేను తెలుసు కున్నాను. నేను వూహించినదానికంటె ఎక్కువగానే శ్రోతలు వచ్చినారు. రెండుపెద్ద సింహాసనములు వేదికపై అమర్చబడినవి ఒకటి బాబావారికొరకు రెండవది శ్రీ తుకొల్‌గారి కొరకు. మామూ లు ప్రకారమే కొన్ని ఉపన్యాసములు ఇంగ్లీషులో జరిగినవి. బాబా వారువాటివిశ్రద్ధగావినిరి. తరువాత బాబావారిదివ్యఉపన్యాసము: చాలా ఉత్తేజకరముగా తెలుగులో ఉపన్యసించినారు. ప్రతివాక్యమును డా. భగవంతముగారు ఇంగ్లీషులోనికి అనువదించినారు. ఇందుమూల ముగా బాబావారి వాక్ ప్రవాహమునకు అవధి ఏర్పడుట తప్పని సరిఅయినది. భగవంతముగారి ఆంగ్లపదములను బాబావారు చిరునవ్వుతో సరిదిద్దుతూ వున్నప్పుడు చాలా ఆశ్చర్యముగా వుండె డిది. ఉపన్యాసమైన తరువాత బాబావారు తమ కంచుకంఠముతో భజనప్రారంభించిరి. సభికులందరూ అపరిమిత ఉత్సాహముతో భజనలో పాల్గొనిరి. సభపూర్తి అయినతరువాత బాబావారు అంద రినీ కొంత సేపువుండమని సైగచేసి వారిస్వహస్తములతో సభి కులందరకూ అయిస్‌క్రీము అందించినారు. బాబావారిని గురించి

పునఃపునః ఆలోచించుచూ. వారినిగురించిన నా పూర్వవ్యూహ లను మార్పుచేసుకుంటూ మధ్యాన్నపువేళకు యింటికిచేరినాము. చాలా రోజుల వరకు మాయింటి సంభాషణలలో బాబావారిని గురించే ఎక్కువగా ప్రస్తావించెడివారము. నాప్రవర్తనలోని కాఠిన్యత కరిగిపోయినది. నాకు యిది కొంచము లజ్జగానే వుండెడిది.

## నా ఉపన్యాసము

నా మొదటి ఉపన్యాసము మే 25 తారీఖు మధ్యాహ్నాము అని నిర్ణయింపబడినది. ఉపన్యసించునపుడు సభికుల అసక్తిని గురించి బాబావారు ఆసమయమందు సభలో వుందురా అని. విరామసమయములో స్నేహితులను అడిగి తెలుసుకున్నాను. మైసూరు యూనివర్సిటీమాజీ వైస్‌చాన్సలర్ గారైన వికమ్‌గారిని కూడా అడిగినాను వారు శ్రోతలు చాలా ఆసక్తితో వింటారని సాధారణముగా స్వామి వారు కూడా ఉపన్యాససమయములో సభలోనే వుండి శ్రోతల మధ్య తమసహజ ధోరణిలో తిరుగుతూ వుంటారని శ్రీవారిసన్నిధి ఉపన్యాసకునికి, శ్రోతలకు కూడా పుష్టికరమైన అవుషధమువలె ఉత్తేజ పరచునని తెలిపిరి. నిక్కమ్‌గారికి కూడా బాబావారితో కొద్దికాలమునుండే పరిచయముకలదు. వారిభావములు నా భావనవలనే దృఢపరచినవి.

నాఉపన్యాసము నాలుగుగంటలకని నిశ్చయింపబడినది. నేను కొద్దినిమిషములకు ముందుగనే అక్కడకు చేరితిని. R R.దివాకర్ గారు ఉపన్యసించుచున్నారు, బాబావారు అక్కడలేరు. ప్రొ॥ గోకాక్

గారు నన్ను సభకు పరిచయముచేసిరి. నేను ఉపన్యాసము ప్రారంభించవలెను. బాబావారికి ఏర్పాటుచేసిన ఆసనము ఖాళీగానున్నది. వారు అక్కడలేరు. నేను చాలా నిరుత్సాహపడినాను. వెంటనే సభలో సందడి మొదలైనది. అందరూ నా వెనుకకుచూచుచున్నారు. నేను వెనుతిరిగి చూచినాను. బాబావారు వొకసాధారణ యినుప మడత కుర్చీపై కూర్చుని తమచుట్టూ వున్న కొద్దిమందిలో మాట్లాడుచున్నారు. హటాత్తుగా పరిస్థితి సుధారించినట్లు అయినది. ఉపన్యాసము పూర్తి అయినతరువాత అల్పాహారమునకు మమ్ము అహ్వానించిరి. ఈ మధ్యనే ప్రచురింపబడిన, నా పుస్తకము వొకటి నేను బాబావారికి అందించితిని. వారు దానిలోని విషయ సూచికను చూచి దయతో ఆశీర్వదించినారు. నన్నూ, నాతో కూడా వున్న ఆడవారిని పిలచి విభూతి తీసుకుంటారా అని బాబావారు ప్రశ్నించినారు. మహా ప్రసాదముగా భావింపుతామని సమాధానము చెప్పినాము. శ్రీవారు తమ సహజపద్ధతిలో హస్తము త్రిప్పి విభూతి సృష్టించి మా అందరికీ తమ ఆశీర్వాదముల ననుగ్రహించిరి. బాబావారి ఉపన్యాసానంతరము భజన జరుగునని మాకు తెలిపినది. కాని చీకటి పడుటకు ముందుగనే బెంగుళూరు చేరవలెననెడి ఆతురతలో మేము ఆ రెండు కార్యక్రమములో పాల్గొని ఆనంద మందుకోలేక పోయినాము.

తరువాత

ఇంటికి పోవుదారిలోనూ, ఆరాత్రి పండుకొనువరకు మాకు వారి కరుణను గురించి తప్ప వేరేమాటలేలేవు. ఆతరువాత గడచిన

దినములలో బాబావారి రూపము నా మనోనేత్రము ముందర సదాసాక్షాత్కరించుచునే యున్నది. అప్రయత్నముగా కూడ వారి ధ్యానమే. ఇదివక విధమైన దాసభావమే కాని, చాలా ఆనందమైనది; మొదటిసారిగా నేను బాబావారి భజన రికార్డును వినుటకు సమ్మతించినాను. విని చాలా పరవశించినాను. పూర్వము చాలాపెద్ద కంఠధ్వనిగా వున్నదని నిరశించిన ఆకంఠధ్వనియే యిప్పుడు నన్నెంతనో మురిపించినది. మేను మరపించినది. భక్తులయందు కూడా సుహృద్ భావనకలిగినది. నాపూజామందిరములో పూర్వము బాబావారి పటములేదు. నాకుమార్తె మీకుతెలియకుండా వక ఫోటోను నేను మీ మందిరములో పెట్టతానని నాతో వేళాకోళముగా అంటూవుండెడిది. కాని ఈమారు నేనే వకపటమును సంపాదించి దానిని నాదేవతా గృహమందు వుంచినాను.

## శ్రీవారికి కృతజ్ఞత

వేసవి తరగతులస్నాతకోత్సవమునకు నేను హాజరుకాలేదు. ఒక వారము రోజులు అయిన తరువాత డా॥గోకాక్‌గారి వద్దనుండి వక జాబువచ్చినది. దానిలో బాబావారు, కొందరు ఉపన్యాసకులను గౌరవించిరని. నాభార్యకు వక చీరెబహూకరించిరని. వచ్చితీసు కొనవలెనని, బాబావారు పుట్టపర్తికి వెళ్ళినారు కొన్నిదినములవరకు రారని వ్రాసినారు, నేను ఆదివారమువచ్చి చీరెను తీసుకుంటాను అని సమాధానము వ్రాసినాను. బాబావారు వచ్చిన తరువాత మా కృతజ్ఞత తెలుపుకుంటామని కూడ తెలిపితిని. ఇది అనుకొనని ఆనందానుభూతి.

ఆదివారమునాడు నేను, నాసంసారమంతా వైట్‌ఫీల్డు వెళ్ళినాము. బాబావారు వచ్చినారని వినగానే మా ఆనందమునకు ఆశ్చర్యమునకు మేరయేలేదు. స్వామివారే వచ్చారు కనుక వారిచేతి మీదుగనే ఆ బహుమతిని అందుకొనవలెనను మా ఆశను శ్రీగోకాక్‌గారికి తెలియపరచితిని. వారు ఆ చీరెను మాకుచూపి, కాగితములొ చుట్టి తీసుకొని వెళ్ళినారు. మేము బాబావారి నివాసమువద్దకు వెళ్లినాము. బాబావారు పనుల తొందరలొ అటు ఇటు తిరుగుచున్నారు. నన్ను చూచి చిరునవ్వు నవ్వినారు. కొంతసేపు అయినతరువాత ఇటీవలనే ప్రచురింపబడిన "సత్యం శివం సుందరం" మూడవభాగమును తెచ్చి సంతకముచేసి ఆశీర్వాదముతొ నాకు ప్రసాదించినారు.

తరువాత బాబావారు ఆవరణలొ చెట్టుక్రింద వున్న భక్తుల వద్దకువెళ్లినారు. ప్రతివారినిశమమందహాసముతొను, పలుకరింపుతొ కొందరినీ, తృప్తిపరచి ఉత్తరములు అందుకొంటు, అందరికి దగ్గరగా దర్శనము చేయుభాగ్యము ప్రసాదించి ఆనందింపజేసిరి. అర్థగంటసేపు అక్కడ వేదికపైనుండి భజనచేయించి, బంగళాకు వచ్చినారు. మేము ఇన్‌టర్‌వ్యూ కోసరమని ఆతురతతో వేచియున్నాము. ఇంకా కొంత మంది అక్కడ కాచుకుని వున్నారు. సుమారు పక గంట వరకు బాబావారి దర్శనము లభించలేదు.

ఆనందానుభూతి

బాబావారు తమగదినుండి దిగివచ్చిన తరువాత కొందరితొ సంభాషించి, వరండాలొ ఎదురు బదురుగా అమర్చియున్నా కుర్చీల

వరుసలో వకదానిపై కూర్చొనినారు. నేను కొంచము దూరముగా కూర్చునినాను. నన్ను పేరు పెట్టి పిలచి తమకు పక్కనున్న కుర్చీలో కూర్చొనమని చూపినారు. కన్నడ భాషలో చిన్నప్రబోధలాంటిది మాకు అనుగ్రహించినారు. అక్కడ వున్న వారందరికి అది ఉద్దేశింపబడినది అయిననూ నన్నే సంభోదించుచూ మాట్లాడినారు మననిత్యజీవితములో సర్వసాధారణమైన సంగతులనే ఉపమానములుగా చూపుతూ ఆధ్యాత్మికజీవితము గురించి బోధించినారు. కన్నడభాషలో వారు అంతగా ప్రావీణ్యత ప్రదర్శింపలేదు; అయిననూ అది లేకపోవటముకూడా వారు పుదహరించిన సామెతలకూ, ఆభాషకూ మాధుర్యమే చేకూర్చినది.

ఆరుంన్నరగంటలు అయినతరువాత బాబావారు లేచి రాహుకాలము దాటుటకొరకై కాసుకుని వున్నాను అని పలికిరి. నన్ను నాకుటుంబమునూ లోపలగదిలోకి రమ్మనమని పిలచిరి. కలకత్తా నుండి దర్శనమునకై వచ్చిన పోలీస్ యిన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ నాయర్‌గారిని కూడా మాతోపాటు లోనికి పిలచిరి. విభూతిని సృష్టించి అందరకూ యిచ్చిరి. ఎనిమిది సంవత్సరముల వయస్సు బాలుడైన నా మనుమనితోసహా అందరినీ పలుకరించిరి. కానీ నన్ను మాత్రము పలకరించలేదు. ఆమాటలు, మాలోని గూఢమైన ఆశలను, భయభీతులనూ పరీక్షించుచున్నట్లుగా నున్నది. మేమెవ్వరమూ ఏమియూ అడుగలేదు. తరువాత బాబావారు నా భార్యను తన దోసిలిపట్టమని చెప్పి దానిపైన నాదోసిలినికూడ పెట్టమనినారు. మీషష్టిపూర్తి సమయమందు నేను రాలేదు కనుక నా ఆశీర్వాదములు యిప్పుడు యిస్తాను'' అని చెప్పి నా భార్యచేతిలో ఒక పట్టు

చీరనూ, నా చేతిలో  పాంట్ షర్టులకు సరిపోవు గుడ్డలను వుంచి అనుగ్రహించిరి  వారి  మామూలు  పద్ధతిలో  చేతినిత్రిప్పి ఒక సన్నని బంగారుగొలుసును సృష్టించిరి. దానిపతకముపై ఒకవైపు షిర్డీబాబాచిత్రము, మరియొకవైపు తమచిత్రముయున్నవి ఆగొలుసు కొంకినితీసి. బాబావారు "నీభార్యమెడలో వెయ్యి" అని నా చేతికి యిచ్చినారు. ఆనంద బాష్పములతొ వణికేచేతులతో వారిఆజ్ఞను పాలించినాను. చివరకు బాబావారు విభూతిని సృష్టించి వారి దివ్యహస్తమును నాచొక్కాలోనికి పోనిచ్చి నాగుండె మీద బాగుగారుద్ది" నేను ఎప్పుడూ యిక్కడ వుంటాను. దీనిని నమ్ము" అనిచెప్పినారు. అందరమూ సాష్టాంగనమస్కారము చేసి బయలుదేరి వచ్చునపుడు బాబావారు" మీరు కారులో కనుక రాకుండిన నాకారులో వెళ్ళవచ్చు" అని అనినారు. వారి వాత్సల్యానికి ముగ్ధులమయినాము. మాకారు తెచ్చినాము అని బదులు చెప్పి శలవు తీసుకున్నాము. కొంచము సేపటిలో బాబావారు. తమ కారులో బైటకువెళ్ళినారు. వినయముతొ వంగి నమస్కరించినాము. శ్రీవారు చిరునగుమోముతొ. అభయహస్తమును చూపిరి. ఆ దినము మరపురాని మధుర అనుభూతులు యిచ్చె.

## కాకతాళీయసంగతులు

ఈవిషయములన్నీ మాస్నేహితులకు తెలిపినది. వారందరూ శ్రీస్వామి ప్రసాదించిన ఆభరణమును చూడవలెనని. జరిగిన సంగతులు తెలుసుకొన వలెననీ చాలా కుతూహలపడినారు. మేము మాఅనుభవములను ఎంతగోప్యముగా వుంచదలచిననూ వారంద

రికీ చూపక, చెప్పక తప్పనదికాదు. ఒక వుదయము నామిత్రు డొకరు నన్ను ఫోనులో పిలచి, మీ అనుభవములన్నీటి ఎందుకు వ్రాయకూడదూ అని ప్రశ్నించినాడు. ఆ సలహా నాకు అంత మన స్కరించలేదు. స్వామివారే నాద్వారా ఏకా సలహా అందించి వుంటారు అని నీవు ఎందుకు తలచరాదు ? అని నామిత్రుడు అడి గినాడు. స్వామియే నాగుండెపై చేయివేసి నేనుయిక్కడ వుంటాను అని చెప్పినారు. నాకు లోనుండి ఆ ఆదేశము వచ్చినపుడు వ్రాస్తాను. అదియూకాక నా అనుభవములలో ప్రత్యేకతలేదు వందలకొలది భక్తులకు ఈఅనుభవము కలదు. ఏదోపెద్దవిషయ ముగా నాఅనుభవము వ్రాసుకొనుటలో అర్థము లేదు అని సమా ధానమిచ్చినాను.

ఇదేవిధముగా అనేకసంఘటనలు కాకతాళీయముగా సంభ వించినవి. వాటికినేను అంతకన్న ఎక్కువ ప్రాధాన్యత విష్వలేదు. బాబావారివద్ద కొంతకాలము గడిపిన హోవార్ మర్ఫేట్ అ౯ ఆస్ట్రేలియా దేశస్థుడు వ్రాసిన ''సాయిబాబా, మహిమల మనిషి'' అను గ్రంథమును నాకు వక స్నేహితుడు తెచ్చియిచ్చెను. అది చదువుటకు చాలా చక్కగా వున్నది. ఆ రచయిత విజాయితీతో వ్రాసినాడు, అందలి సందర్భములను అనుమానించుటకు కూడా ఆస్కారమేలేదు. బాబావారితో అనేక సంవత్సరములనుండి పరి చయమువున్ననేను అనేకవ్యక్తులనుకలుసుకున్నాను. చాలాఏండ్లగా సాయిభక్తుడుగాయున్న శ్రీరాఘవాచారిగారినికూడ కలుసుకున్నాను. వారికి వయస్సు ఎనభై వుండును. వారు నన్ను తమయింటిలో పూజ

గదిలోనున్న బాబాగారి పెద్దఫొటోనుండి విభూతి ఏవిధముగా ధారగా వచ్చుచున్నదో చూపించినారు. అక్కడనే యిరుగు పొరుగు వారుంచిన సుమారు యిరవై ఫొటొలనుండి కూడా విభూతిధారలు కురియుచునేవున్నవి. ఈవింతసామాన్యముగా చాలాచోట్ల కనబడుతునే వున్నది. నేను యాది యింకకొన్ని ప్రదేశములలో కూడ చూచినాను.

## శ్రీవారి ప్రేమ

ఈ మహిమలు చూపుటకంటె బాబావారి మాధవత్వములో దివ్యమానవత్వపు విదర్శనలు చాలా నేను విన్నాను. నెలదినములు విరామమే లేకుండ, వేసవి తరగతులకు హాజరైన విద్యార్థుల విషయములో ఆయన చూపిన శ్రద్ధ వర్ణింప నలవికానిది. ఆయన కొంచము కూడా అలసినట్లె కనబడలేదు. విద్యార్థులు భోజనములు చేయునపుడు వారివద్దకు బాబావారు వెళ్ళిప్రతివారి అవసరములను అడిగి తెలుసుకొని, వొక్కక్కసారి వారే వడ్డనకూడ చేసెడివారు రోజంతయు వ్యవధి లేకుండా కార్యక్రమములో పాల్గొని. ఉదయమెంత ఉత్సాహముగా వుండెడివారో రాత్రికూడ అంతే ఉత్సాహముగా వుండెడివారు. ఎప్పటికప్పుడు నవోన్మేషవుత్ఫులమే; తరగతులు పూర్తిఅయిన తరువాత యువకులైన ఆ విద్యార్థులు విద్యార్థినులు, బా బా వా రి స న్ని ధి ని వీడ లేక వెడలుటకు ఎంతగానొ విచారించిరి. వారు కండ్ల నీళ్లతొ మరల ఎంతతొందరలో బాబావారివద్దకు వద్దామాఅను ఆతురతతో వెళ్లినారు. ఇండ్ల నుండి కూడా ఆభావములే జాబులలో వ్రాసినారు. ఈ తరగతుల

వుద్దేశ్యముఅమోఘమైనది, అవివిజయవంతముగాసాగినవి. ప్రతిది
త్యమూ అయిదు గంటల కాలము ఉపన్యాసములద్వారా బోధలు
వినుటయేకాక వారికి సంఘజీవితము కూడ అలవడినది.
నిజమైన శిక్షణ, ఆధ్యాత్మికపు శిక్షణే. సాధారణముగా వుండు
పినిమాలు, హోటళ్లమొదలగు ప్రతిబంధకము లేక ఈప్రశాంత
మైన మార్పుకు వారు చాలా ఆనందించిరి. ఇది ప్రతిసంవత్సర
కార్యక్రమము అవుతుంది అని బాబావారు నాకు తెలియజేసిరి.

## గాంధీభవనము

ఒకటి, రెండు చిన్నసంగతులను కూడ తెలిపెదను.
జూన్ 18 ఆదివారమునాడు గాంధీభవనమందు చాలా జనముగూడి
నారు. పేపరులో డా॥గోకాక్‌గారు అధ్యక్షులుగా సభజరుగునని
మాత్రము తెలిపిరి, సాయంత్రము 6-30గం॥లకు నా కుమార్తె
బాబావారు అక్కడకు వస్తారుఅని తెలిపినది, ఫోనుచేసి కనుక్కుందా
మని ప్రయత్నించితిని కాని నిర్ధారణగా వారు చెప్పలేదు. ఆ
సభకు వెళ్ళవద్దుఅని నిర్ణయించుకున్నాను. ఆ ఉత్సవము సత్య
సాయి సేవామండలి అయిదవ వార్షికోత్సవము. ఆరుగంటలకు
అయిదు నిమిషములు వుండగా నాకు బుద్ధి మళ్లి, నేను మా
అమ్మాయి యిద్దరము మా కారులో మీటింగుకు వెళ్లినాము.
సాధారణముగా నేను స్వయముగా కారునడుపను ఈ మారు నేనే
డ్రైవుచేసినాను, సరిగ్గా అదే సమయమునకు బాబావారు కూడ
విచ్చేసి ఏబది నిమిషములసేపు కన్నడములో ఉపన్యసించిరి, ఇది
చాలా అరుదు, భజనకూడ చేసిరి ఆ హాలు, వరండాయేకాక

ఆవరణ అంతయూకూడ జనముతో కిటకిట లాడుచున్నది. రెండు వేలకుపైననే శ్రోతల సంఖ్య వుండును. బాబావారు వారిమధ్యన తిరిగిరి. బాగా అలంకరింపబడిన వేదికపై వారికొరకు ఒక సింహాసనము అమర్చబడినది. కాని బాబావారు దానిపైన కూర్చొన కుండ పాదములు నేలకానిచి వేదిక అంచున కూర్చొనినారు. ఉత్సవము పూర్తిఅయిన పిమ్మట, బాబావారు పక్క ద్వారము గుండా వెళ్లిరి. వారివెంట ఎయిర్ మార్షల్ మెహ్రాగారు, ప్రొ॥గోకాక్ గారు వెళ్లిరి. అప్పుడు రాత్రి ఎనిమిది యిరవైనిమిషములయినది. నేను ద్వారమువద్ద వినయముతో నిలబడివున్నాను. "నీవు వచ్చినందుకు చాలా సంతోషము" అని కన్నడములో మెల్లగా బాబావారు అన్న మాటలు వినగనే ఆనందముతో నిశ్చేష్టుడనైతిని.

## కోరిన ఫోటో

ఈ మధ్య జరిగిన మరొక విషయము. మేము వైట్ ఫీలు వెళ్లినపుడు ఆ బంగళాలోని ప్రార్థన మందిరములో, బాబావారి పెద్దఫొటోను వకటి నాభార్యచూచినది. ఆఫొటోలో బాబావారి మోఖము చిరునగవు చిందించుచూ, చాలా సుందరముగా యున్నది. నేను ప్రత్యేకముగ దానిని గమనించలేదుకాని ఆమెమాత్రము దానియొక్క చిన్నకాపీ వొకటి పొందవలెనని చాల వాంఛించినది. మనప్రయత్న మక్కరలేకనే అదేవస్తుందిలే అని నేను ఆమెను పూరడించినాను. అలాగే జరిగినది. జూన్22 వతారీకు గురువారమునాడు డా॥సేతురావు అను వకమిత్రుడు

నాకు యివ్వమని పకఫోటోను యిచ్చినారని నామిత్రులొకరు తెచ్చియిచ్చినారు. అదే ఫోటోను ఆమె కోరినది! ఈఅద్భుత మునకు అందరమూచలించి పోయినాము. అందులోను గురువారం నాడు గురుమూర్తి ఫోటోరూపం రావటం చాలా ఆనందమై నది. ఫ్రేము కట్టించిన దాక వేచియుండక ఆరోజే పూజలో పెట్టి పూజించవలెనని చాల ఆతురతపడినాము. ఆరోజు ఫ్రేము కట్టించు టకు పీలుపడలేదు. మొర్నాడు ఫ్రేము పనివారల దగ్గరకు తీసుకుని వెళ్లి, 11 గం॥లకు ముందుగా దానిని యివ్వవలెనని చెప్పి, నా మనుమని అక్కడ వుంచి పూజ ముగియకముందుగా దానిని తీసు కుని రమ్మనమని చెప్పితిని. పటము సకాలమునకు రాలేదు. పూజ ముగించక వేచియున్నాను. మధ్యాహ్నమైనది. పూజ మొదలుపెట్టు టకు ఏర్పాట్లు చేయుచున్నాను. శుక్రవారమగుటవలన నాగస్వర రికార్డు పెట్టినాము. సరిగ్గా నేను మంగళహారతి యిచ్చుచున్నవేళకు ఆ ఫోటో వచ్చినది. పూలతో అలంకరించి దానిని పూజమందిర ములో ప్రతిష్ఠించితిని. మంగళవాద్యము మ్రోగుచుండగా, మంగళ హారతి అందుకొనుచూ శుక్రవారంనాడు ఆ రూపంలో స్వామి మా యింటికి వచ్చారని మా ఆడవారు చాల ఆనందించిరి.

## పెద్దమహిమ

నాకు తోచిన కొన్ని విషయములు మనవిచేసి నేను ముగిం చెదను. నా మిత్రుడు నన్ను వ్రాయమని నాకు సలహా యిచ్చినా, నేను యిది అంతయూ నాలోనుండి ప్రేరణవలనే వ్రాయుచున్నా ను. ఈ వయస్సులో మరుపు అధికము. ఈ విషయము మరచిపోక

ముందే వ్రాయుట మంచిదని వ్రాయ మొదలుపెట్టినాను. కాలము గడచినకొలదీ నా జ్ఞాపకములు చెదరిపోవచ్చును. నా అనుభవముల లో ప్రత్యేకత లేకపోయిననూ, నాకు అవి చాలా విలువ అయినవి. నా కండ్లు తెరిపించినవి. నా అనుభవములను అనుమానించ అవసర మేలేదు. మామూలు మహిమలన్నిటిలో నమ్మకములేని మనసును మార్పుచేయుట, అన్ని మహిమలకన్న పెద్ద మహిమ అని నా వుద్దేశ్యము. నా ఆత్మసాక్షిగా వ్యవహరించాలని నేను సదా వాంఛిం చెడివాడిని. ఆ అంతఃసాక్షియే మూర్తీభవించి సాక్షాత్కరించుట కంటె మహాభాగ్యమేముండును? నాకు బాబావారే ఆ మూర్తీభవిం చిన నా సాక్షి.

"నీవుకూడ మారినావే" అని నా స్నేహితులు చాలామంది ప్రశ్నించుట మొదలుపెట్టినారు. కొందరు ఆశ్చర్యముగను, కొంద రు వేళాకోళముగను, కొందరు వెక్కిరింపుగను, కొందరు యిష్ట ముగను, కొందరు అయిష్టముగను వారివారి మనోభావానుగుణము గా అడిగెడివారు. నాకు 'మార్పు' అను పదము నచ్చలేదు. నా విషయములో జరిగినది అదికాదు. నాలో మార్పు ఏమీ రాలేదు. కానీ నేను బాబాగారి అమోఘమైన వ్యక్తిత్వాన్ని అద్భుత శక్తుల ను కొద్దిగా అర్థముచేసుకొనుట నేర్చుకున్నాను. నా దృక్పథము మారలేదు. నా సాధనకూడ మార్చుకొనవలసిన అవసరము రాలేదు. నా సాధనక్రమము బాబావారి పరిచయమువలన సరిఅయినదే అని దృఢపడినది. శక్తితగ్గిన బ్యాటరీలను మళ్ళి శక్తివంతము చేసు కున్నవిధముగా నాలోని ఆత్మవిశ్వాసము బాబావారి దర్శనము

వలన అభివృద్ధిపొందినది. నా వెనుకటి దారినే నేడు నడచుటకు నిర్ణయించుకుంటిని. ఇంకను విశదముగ వివరించెదను. బాబావారు సదా నా వెంటనే యున్నారని నేను తలచుచున్నాను. నాకు వారు ఆ విధముగా మాటయిచ్చినారుకూడా ! వారు నాకు కలుగజేసిన భావనలు చెదరిపోలేవి. కలకాలం నిలచిపోవునవి. సాధారణజీవన సమస్యలకూ, ఆధ్యాత్మికసాధనలోని సమస్యలకూ కూడ నేను బాబావారి సలహాలు సహాయము అర్థించెదను. నాకు వారియందు అచంచలమైన విశ్వాసము కలదు. కనుక, వారు శారీరకముగా నా ఎదుట లేకున్ననూ వారివద్దనుండి సహాయము పొందగలనను నమ్మకము నాకు వున్నది. కనుకనే మాటిమాటికి దర్శనముకొరకై ఉబలాడపడుటలేదు. నాలో ప్రేరేపణ ఎప్పుడు కలుగునో అప్పుడు తప్పక వెళ్ళెదను.

సామూహిక ప్రార్థనలు. భజనలయొక్క ప్రాముఖ్యతను నేను అంగీకరించిననూ నామట్టుకు నాకు వాటియందు అంతా అభి రుచిలేదు. ఒంటరిగా, ఎక్కడైనా నిశ్శబ్దముగా ధ్యానము చేసు కొనుటలోనే నాకు ఆసక్తిమెండు. గురువు విషయములోకూడ వారి సాన్నిధ్యములో ఎక్కువ తెలుసుకొను విషయములు కలవు కాని పెద్ద ఉపన్యాసములలో నేర్చుకొనవలసినది ఎక్కువగా ఉండ దని నా ఉద్దేశ్యము. శరణాగతి వక్కటి గత్యంతరమైన మార్గము కాని మనప్రయత్నము మనము మానకూడదు. ప్రపంచవిషయ ములందైనా పారమార్థిక విషయమునందైనా పురుషప్రయత్నము చేయవలెను, మీదటనే భగవంతునికి పూర్తి శరణాగతుడు కావలెను.

## పురుషార్థము

హిందూ వేదాంతముయొక్క పరమావధి, మోక్షమే. దానికి అతిచేరువ అయిన సాధన జ్ఞానము. ఈ రెండు యించుమించు సారూప్యములే. ఇప్పటికిప్పుడే మోక్షము కావలెననెడివారు మనలో చాల తక్కువ. వారివారి యోగ్యతలనుబట్టి ఆ స్థానమును అందుకొనుటకు వేరువేరు సోపానములు కలవని మనము అంగీకరించక తప్పదు. ఈ సోపానములను దాటిన మీదటనే ఆ స్థానమందుకోగలము. వాటిని అలక్ష్యము చేయలేము, వదలనూలేము. అందువలననే గీతలోకూడ తనధర్మమును తను సక్రమముగ నిర్వర్తింపవలెనని నొక్కి చెప్పబడినది. పరధర్మాచరణకు పూనుకొనుట విప్రయోజనమేకాక హానికరమనికూడ బోధింపబడినది.

పూర్వపు భారతీయ వేదాంతమంతా చతుర్విధ పురుషార్థములమీదనే ఆధారపడి యుండెడిది. మానవులలోనున్న విభిన్న అర్హతలను ఆధారము చేసుకుని ఈ పురుషార్థములను నిర్ణయించిరి. ఈ ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములనుగురించి బాగుగా యోచించిన మనకండ్లముందు సంపూర్ణ సమగ్రమైన ఆచరణయోగ్యమైన పద్ధతి మనకు గోచరమగును. ప్రతివ్యక్తిని సర్వకాలములందు అన్ని ప్రదేశములలో, అన్ని పరిస్థితులకూ సమమైన సక్రమమైన మార్గము యీ పురుషార్థములవలన చేకూరును. ఇవి యిహ పరములకు సంధివంటివి. పురుషార్థముల నలక్ష్యము చేయుటవలన, ఆధ్యాత్మికమున మొదటి మూడు పురుషార్థములనువదలి, చివరిదైన మోక్షముతోమాత్రము ముడిపెట్టుట

వలన చాల చెడువాటిల్లినది. వ్యక్తియొక్కయూ, సంఘము యొక్కయు సమగ్రత సౌందర్యముకూడ చెదరినది. సమైక్యతా భావము నశించినది. తెలివి తప్పుదారులు పట్టినది. వీటి పర్యవసానముగా లొంగుబాటుగుణము, అవకాశవాదము పెచ్చుపెరిగినవి.

మన నాయకులు ఈ పరిస్థితిని మార్చ ప్రయత్నించినారు. వారికి మతమే మన కష్టములన్నిటికీ కారణమను తప్పుభావన యేర్పడినది. భౌతిక సుఖముకొరకు వారు, విజ్ఞానశాస్త్రమును సాంకేతికశాస్త్రమును, మాత్రమే తీవ్రమైన ఏకాగ్రబుద్ధితో అభివృద్ధిపరచుటకు పూనుకుంటున్నారు. లౌకికములేక, మతరహిత విధానముయొక్క సారమే మన సైన్సుకు తెలియని, అందని విషయమును తెలుసుకొనుట నిరాకరించుటయే. దానికి పైమెట్టు విజ్ఞానశాస్త్రమునకు తెలియని మహత్తరమైన విషయము ఒకటి వుందని వొప్పుకొనకపోవటము. ప్రపంచమంతనూ గెలిచి తన ఆత్మను తాను పోగొట్టుకొనిన ప్రయోజనమేమని ఈ పరిస్థితిలో మనము ఒక ప్రశ్నవేయువచ్చును. ప్రపంచవ్యాప్తమైన ఈ లౌకిక రాజ్యముయొక్క భావన, పురుషార్థమూలకమైన మన సంస్కృతికే వ్యతిరేకము. నవనాగరికతవలన కలిగిన కష్టనష్టములను యిప్పుడిప్పుడే అభివృద్ధిపడిన దేశములవారు గుర్తించుచున్న ఈ తరుణములో మనవారు వారిస్థాయిని అందుకొనవలెనని తమశక్తినంతయూ వినియోగించుట మన దురదృష్టము. చాల గర్వకారణమనుకున్న అణుశక్తిమూలకముగ మానవజాతి మనుగడకే ముప్పువాటిల్లెను. జనాభా అభివృద్ధి, వాతావరణ అశౌచము మొదలగు

నవన్నియు పునాదులనే పెకిలించుచున్నవి, సాంకేతికశాస్త్రము తిరుగులేని విధానముగా అభివృద్ధి అయినది. "పిశాచము పట్టిన కోరికలు మెండు" అన్న విధముగా వున్నది. సంపన్నసమాజము లో ఆదుర్దా, భద్రితలేనితనము సదా గోచరించుచున్నది. మానవ జీవితము అర్థరాహిత్యమైనది. అందుమూలముననే విప్లవములు, ప్రస్తుతప్రమాణములపై తిరుగుబాట్లు చెలరేగుచున్నవి.

అందువలననే మహాత్మాగాంధీగారు మనము పాశ్చాత్యులను అనుసరించ అవసరములేదని, కూడదనికూడ గట్టిగా చెప్పిరి. సర్వ శక్తిమయుడూ, సర్వవ్యాప్తుడూ భగవంతుడను విశ్వాసముపైననే ఆయన సత్యాహింసల సూత్రములు ఆధారపడియున్నవి. ఆయన మాటలను ఈ రోజులలో చిలుకపలుకులవలె వల్లించుచున్నారుకాని, వాటిలోని దైవవిశ్వాసముయొక్క ఆధారమును మరచిపోయినారు. నాస్తికవాదము, లౌకికజీవన విధానముతోపాటుగా నైతికజీవనవిధాన ముకూడ సహజీవనము సలుపవచ్చును.

## జయించబడినాను

ఇటువంటి దుర్దశలో వైకుంఠమునుండివచ్చిన ఆశాకిరణమా అన్నట్లు. బాబావారు అవతరించిరి. మొరలాలకించవలసిన సమయ ము ఎప్పుడు కలుగునో. అప్పుడు ప్రార్థనలను మన్నించి, పర మాత్మ అవతరించి ప్రపంచమునకు విమోచన కలిగించునను సత్య మునకు యిది వక నిదర్శనము. ఆస్తిక్యభావమే లౌకిక, పార లౌకిక క్షేమమునకు పునాదిస్థానము. ఈ దృక్పథమును. భౌతిక

శాస్త్రవేత్తలు మూఢనమ్మకము అని త్రోసిపుచ్చవచ్చును. వారు ఆ విధముగా యోచించుట వారికే కష్టము, వినాశకరమూ. హద్దులలోనుండినంతవరకూ విజ్ఞానశాస్త్రము ప్రామాణికమైనదే. విజ్ఞానశాస్త్రమునకు విశాలమైన అవగాహనశక్తితోకూడి యుండవలసిన అవసరమెంతయోగలదు. లేనియెడల దానియొక్క మారణశక్తి దానిని, మనలనుకూడ, ముంచగలదు. అది మంచిసేవకుడుగా వుండవలెనుకాని యజమానిమాత్రము కారాదు.

భౌతిక, మానసిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక అవగాహనల యొక్క మూర్తియే బాబావారు. గీతలో వీటినే అధిభూత, అధిదైవ, అధ్యాత్మ అని వర్ణించినారు. ఈ విషయము వారిని వెంటనే తెలియుచుండును. కనుగొనుటకు పెద్ద ప్రయత్నమక్కర లేదు. అందువల్లనే వేలకువేల ప్రజలు వారి దర్శనముకొరకై తహతహలాడుదురు. ఇటీవల విజయవంతమైన బాబావారి ఢిల్లీ యాత్ర దీనికొక ఉదాహరణమాత్రమే.

గాంధీగారియొక్క గొప్పతనము నిర్వివాదాంశమే, కాని వారు సాధారణమానవుడు ఎన్నడూ చేయలేనటువంటి తపస్సు, త్యాగము మొదలగు నీతులను ప్రజలనుండి ఆశించినారు. బాబావారు అటులకాకుండా ఏ వ్యక్తి ఏ పరిస్థితిలోవుండిన ఆ స్థితిలోనే వారిని స్వీకరించెదరు. తల్లి తన బిడ్డకు నడక నేర్పినట్లు, బాబావారు, తమభక్తులను క్రిందమెట్టునుండి పైమెట్టుకు ఎక్కించెదరు. తల్లి సన్నిధి బిడ్డకు ఎంతతృప్తి కలుగజేయునో బాబావారి సన్నిధి భక్తులకు పెన్నిధియే.

"నేను వచ్చాను, చూచాను, జయించబడినాను" అని చెప్పుటకు నేను ఒక నిదర్శనమని తెలుపుకొనుచున్నాను.

కె. గురుదత్ I.A.S. (Retd)



## యెవరికోసము ?

### శ్రీమతి ఈశ్వరమ్మ ఉన్నత పాఠశాలా ప్రారంభోత్సవమందు

### (శ్రీవారి దివ్యబోధ)

దేహమున ప్రతి అవయవమునకు ప్రత్యేక రూపనామములు కలవు: అయిననూ, అవన్నీ కూడి ఏకమార్గములో ప్రవర్తించినపుడే దానికి దేహమనే పేరు. అదే రీతిగా, ఒకొక కుటుంబము గ్రామముయొక్క అవయవము, యే చిన్న కుటుంబమునకు కానీ పెద్దకుటుంబమునకు కానీ కష్టము సంభవించిన, అది గ్రామమునకే కష్టము కల్గినట్లే భావించి అందరూచేరి తగిన పరిహారము చేయవలెను.

క్రిందున్న బొటనవ్రేలుకు దెబ్బతగిలిన, పైనున్నశిరస్సుకు దెబ్బతగిలిన, అనుభవించేవాడు ఒక జీవుడే కదా: అల్పజీవి అయితేయేమీ ధనికుడైతేయేమీ, ప్రమాదము గ్రామమునకే అని భావించవలెను: గ్రామమనే దేహమునకే లోపము, బాధ: ఈ

సత్యమును గుర్తించినపుడు గ్రామములు సర్వానందముతో సర్వాను కూలాలతో నిత్యకల్యాణము పచ్చతోరణముగా అభివృద్ధి చెందు ను; దీనికి సందేహమే లేదు. ఒక విద్యావిషయమునందే కాదు. గ్రామ కల్యాణమునే దృష్టియందుంచుకొని, పిల్లల భవిష్యత్తును గురించి, పెద్దలు మంచి ఆదర్శములనందించి, వాటిని వారు కూడ అనుసరించి, తోడ్పడిన; యెంతో అభివృద్ధిని పొందవీలగును.

కాబట్టి, మీరందరూ ఆనందహృదయములతో సహకార సహాయములనందించి మీమీకర్తవ్యమును నిర్వర్తించు కొనవలెను.

మానవులకు ప్రధానముగా నాలుగు మందిరములు కలవు; ఒకటి భోజనాలయము. పాంచభౌతిక శరీరము అన్నగతప్రాణము కాబట్టి, పుట్టిన తక్షణమే ఆ చిన్న పొట్టకు పాలుకావాలి; అదే దానికి ఆహారము. జిహ్వేంద్రియముతో రుచిచూచి తినేఅన్న మూ, ఆహారమే; ముక్కుతో పీల్చే గాలి కూడ ఆహారమే. చూచే దృశ్యములూ, స్పర్శించే స్పర్శన, వినేశబ్దములూ ఆహారమే

యే క్రొత్త గ్రామమునకు వెళ్ళిననూ, మొట్టమొదట అక్కడ భోజనాలయమేది అని వెదకి, ఒక రూము తీసుకొని దానిలో సామానులను పడవేసి, తదుపరి చిత్రవిచిత్రాలన్నిటినీ చూచేకొరకు బయలుదేరుతారు. అన్నము అత్యవసరము కాబట్టి భోజనాలయము మొదట ఆలయముగా తోచును.

ఇక, ఆభోజనాలయములో మితి మీరి మెక్కుటమువలన, ఆరోగ్యము చెడి దానిని బాగుచేయించుకొనే కొరకు రెండవ ఆలయ మైన వైద్యాలయమునకు వెళ్ళుదురు.

తరువాత కావలసినది, విద్యాలయము; దానిలో ప్రవే

శించే ముందు విద్యార్థులు దేవాలయమును దర్శించవలెను. ఎందు కనిన, తనలోని దైవత్వమును అర్థముచేసికొనే నిమిత్తమే, విద్య అవసరము. అట్టి తత్వమును విశదముగా బోధించి దానిని తెలిసికొనుటకు ఆతురతనూ వుత్సాహమునూ అందించే విద్యనే నిజవిద్య.

అయితే ఇప్పుడు అవసరమైన విషయములన్నిటినీ తెలిపి కోవటమే విద్యార్జన అనే అభిప్రాయము బలపడినది. భోజనా లయమునకు వెళ్ళితే, పదార్థములనే ఆశించి అందుకొంటున్నారు; వైద్యాలయము చేరితే, మందుల సంగతినే విచారించి తెలుసు కొంటున్నారు; దేవాలయములోనూ అంతే; దేవుని పూజలోనే మనమ్ము నిలుపును.

అయితే విద్యాలయములో మాత్రము లేనిపోని లోకవ్య వహారములన్నిటినీ బుర్రలో చేర్చుకొని విద్యార్థులు ఉపాధ్యా యులు ఇద్దరూ ఆ పేర్ల అర్థమునే గుర్తించక పోతున్నారు.

తల్లితండ్రులు, పెద్దలూ గ్రామస్థులందరూ, పిల్లలమంచి చెడ్డలను గమనించి తమ ప్రవర్తనలను దిద్దుకొని ప్రోత్సా హించ వలెను.

పుట్టపర్తి పేరు ప్రపంచ వ్యాప్తమైనది; జగద్వ్యాప్తమైనది. పవిత్రకీర్తిని ఆర్జించినది. ఆయితే విద్యావిషయములో చాలా వెనుక బడినదని గుర్తించి (నన్నొకర్కరడుగనక్కరలేదు) ఈ ఉన్నత పాఠశాలను స్థాపించడమైనది. ముమ్ముందు ఇదొక కళాశాలగా కూడ అభివృద్ధిచెంది, చుట్టుపట్లు గ్రామముల పిల్లలకు తగిన విద్యాభ్యాసమున కవకాశమును అందించును. ఈనాడు

వేసిన ఈ విత్తనము పెద్దవృక్షముగా పెరిగి మంచిఫలమునందిం చును.

ఇట్టి అభివృద్ధి కార్యములను నేను. చేసేది యెవరికోసము? ప్రజలకోసము అంటారా? కాదు, నా తృప్తికోసమే నేనుచేయు చున్నాను! మీకోసమన్న మీరు వేరు, నేను వేరు అని అర్థమగును అట్ల కాదు. బల్బుల రంగులలో భేదాలుండవచ్చును; వోల్టేజీలో భేదములుండవచ్చును కానీ అన్నిటియందూ ప్రవహించే, అన్ని టినీ వెలిగించే కరెంటు ఒకటే.

"ఈశావాస్య మిదం సర్వం!" "వాసుదేవ స్సర్వమిదం" అనే తత్వముననుసరించి అందరిలోనూ వెలిగె దైవమునే ఆద రించి భేదాభిప్రాయములకు కుయుక్తులకు నక్కకూతలకు యే మాత్రము చోటివ్వక కాలమును వ్యర్థముచేయక హృదయపూర్వ కముగా గ్రామముయొక్క పిల్లల అభివృద్ధిని గమనించుటకు పూనుకోవలెను.

పెట్టిన అన్నమును సంతృప్తిగా ఆనందముగా భుజించితే పెట్టిన వాళ్ళకూ తృప్తి; తిన్నవాళ్ళకూ కడుపునిండును. వాళ్లె దురుగనే ఇదేమిటీ అనివిసిరితే మరొకపర్యాయము పెట్టడానికి హృదయము అభిలషించదు. విద్యాభిక్షకూడ అంతే! దీనిని శ్రద్ధతో పోషించి పెంచవలెను. విద్యాభిక్షను అందుకొన్న పిల్లలు వున్నతస్థానమును చేరుదురు.

ఇదికాక ప్రజలకు దారిద్ర్యదుఃఖమును బాపేకొరకు నిత్య మూ ఆకలిబాధతో కుమిలిపోతున్న బీదవాళ్ళకు యేదో ఉపశాంతిగా ఇండస్ట్రీస్ కొన్ని ఇక్కడ ప్రారంభించవలెననే సంకల్పము

న్నది. పవిత్రసంకల్పమునకు తగిన ప్రయత్నమూ శ్రద్ధాభక్తులూ మీనుంచికూడ రావలెను. ఔషధమహిమను విన్నమాత్రమున జబ్బు నయమగునా? పెంసిలిన్ ఇంజెక్షన్ అని పలుమార్లుదాని ప్రభావము ను పొగడిన ఫీవరు నార్మలుకు వచ్చునా? ఊహాగానముతో కాలమును వ్యర్థముచేయక ప్రయత్నములోనికి ప్రవేశించవలెను. క్రియా రూపమైన ఆచరణ అవసరము.

బోధించితే చాలదు; ఆచరించి అందించే నిమిత్తమై ఈమె పేరుతో ఈ వున్నత పాఠశాలను స్థాపించటము, ఆయన పేరుతో కల్యాణమంటపమును స్థాపించటము జరుగు చున్నవి. అమ్మ నాన్నగారి ఆస్తిపాస్తులుమాత్రము కావాలి, వారిఆజ్ఞను పాలించటము చేతకాదనిన వారు భారతపుత్రులేకాదు. వారిరక్తమునే ధారపోసి పోషించి పెద్దచేసిన తల్లితండ్రులకు చేతనైనంతవరకూ తమ శక్తిని అర్పితము చేయటము, ప్రతిఒక్కరి కర్తవ్యము.

సత్యంవద। ధర్మంచర। మాతృదేవోభవ। పితృదేవోభవ। అనే ఉపనిషద్వాక్యమును నిలబెట్టి భారతీయ సంస్కృతియొక్క రత్నాలవంటి సత్సంప్రదాయములను అందరూ ఆచరించవలెననే నావుద్దేశము; అపుడే సుఖశాంతులు శుభ సౌభాగ్యాలు వ్యక్తికినీ సమాజమునకూ లభించేది. మంచి కార్యములు చేయండి; మంచి చూపులు చూడండి; మంచివిషయములలో పాల్గొనండి; మంచి మాటలు ఆడండి; మంచి తలపులు తలచండి; అందరిలోనూ ప్రకాశించుచున్న ఆత్మను ఆదరించి ఆరాధించి ఆనందించండి—

20-7-72

## పుస్తక సూచి

1 పుస్తకముల వెలయూ పోష్టు మరియు రిజిష్ట్రేషను చార్జీలయూ మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకములు వాటి పోష్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలయూ పోష్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| **తెలుగు:——** | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | ,, ,, (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | చగీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిరాముడెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | | |
|---|---|---|---|
| 14. | భజనావళి | 1-00 | 0-20 |
| 15. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16 | స్తుతి తరంగణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:———

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. | వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. | డివైన్ వాలి టు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:-

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0-30 |
| 3. | ,, ,, (3భా) | 4-00 | 0-30 |
| 4. | ,, ,, (4భా) | 5-00 | 0-40 |
| 5. | ,, ,, (5భా) | 5-00 | 0-40 |
| 6. | ,, ,, (6భా) | 5-00 | 0-40 |
| 7. | ,, ,, (7భా) | 7-00 | 0-65 |
| 8. | సెలక్టెడ్ జ్యూయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| 9. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 10. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 11. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 12. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 13. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 14. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 15. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 16. | భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | ,, ,, ,, (2వ భా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాత | 1-00 | 0-10 |

| | | |
|---|---|---|
| 9. ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. సందేహనివారిణి | 2-00 | 0-25 |

హిందీ:——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | |
|---|---|---|
| 1. ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతిః——

| | | |
|---|---|---|
| 1. అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. కథాసుధ | 2-00 | 0-15 |

సింధి:—

| | | |
|---|---|---|
| 1. భజనావళి | 0-50 | 0-10 |
| 2. ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. సత్యం శివం సుందరం (2వ భా) | 4-00 | 0.40 |

మేనేజర్. సనాతన సారథి.



1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4 రు॥ ఒక సంవత్సరమునకు తక్కువకాని 5 సం॥ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలను పంపించునప్పుడే ఈ క్రిందివివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలు పంపేవారు "క్రొత్తచందాదారు" అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువుపొడుగించుటకు, తన చందానెంబరును చందాపంపించు సమయమునందే తెలియచేయవలెను.

సి) తెలుగుపత్రిక కావలెనో, లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగావ్రాయవలెను

డి) చందాదారు తన పేరును పూర్తివిలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారాచందాను పంపించువారు వారిపేరును, పూర్తివిలాసమును M.O కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని, పుస్తకములుకాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు, వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. (M.O. ద్వారా పైకమునుపంపువారు కూపనులోనే కావలసినపుస్తకముల వివరములను తెల్పవలెను)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను. పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను, "సనాతనసారధి", ప్రశాంతినిలయం పోస్టు అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకి ఖర్చులనుకూడ కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాక, లేక పుస్తకములుగాని, చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5, పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ఆర్డరునెంబరును తప్పకవ్రాయవలెను. అట్లువ్రాయనియెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

6, పోస్టుద్వారా ఫోటోలు పంపబడవు.

ఆంధ్రప్రదేశ్ అనంతపురం జిల్లా ప్రశాంతినిలయమునందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయమందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి, బి. వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయిట్రస్టు తరపున ప్రచురింపబడినది. ఎడిటర్, యన్ కస్తూరి యం. ఎ., బి. యల్.

